

అక్టోబరు **1978** సంచికతో

అందిస్తున్న

పూర్తి నవల

# ప్రేమ - త్యాగం

రచన : చీర్ల సీతాదేవి

# ప్రేమ - త్యాగ

"సావిత్రి సీరియస్ స్టార్ట్ యిమీడియట్లీ" టెలిగ్రామ్ అందుకు ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని వెంటనే బయల్దేరారు శివరామయ్య గారు, పార్వతమ్మ, సరిత.

*　　*　　*

ఇంటి ఆవరణలో టాక్సీ ఆగింది. ముందుగా సరిత, పార్వతమ్మ టాక్సీ దిగి గబగబా లోపలికి వెళ్ళారు.

టాక్సీ అతన్ని పంపేసి ఆదుర్దాగా లోపలికొచ్చారు శివరామయ్య.

తలుపులన్నీ బార్లా తెరిచివున్నాయి. ఇల్లంతా నిశ్శబ్దగావుం హాలులో రెండేళ్ళ బాబు, ఆర్నెల్ల పాప పడుకుని నిద్రపోతున్నార పెరట్లో పనిమనిషితో ముచ్చట్లాడుతున్న డ్రయివర్ పరుగె కొచ్చాడు. అతన్ని చూడగానే శివరామయ్యగారు 'అమ్మాయి హాస్ టల్‌లో వుందా?' అని ఆత్రుతగా అడిగారు.

"అవునండి. మీరు వస్తే హాస్పిటల్‌కి తీసుకురమ్మ చెప్పారు అయ్యగారు, కారు కూడా యింటి దగ్గరేవుంచి వెళ్ళారు. వినయంగా జవాబిచ్చాడు డ్రయివర్. క్షణంలో ముగ్గురూ కారెక్కి కూర్చున్నారు.

"అమ్మాయికి యేం సుస్తీ? ఎప్పటినుంచీ? యిప్పుడెల వుంది?" ఆత్రుతగా ప్రశ్నల వర్షం కురిపించింది పార్వతమ్మ.

"పాప యేడుస్తూంటే పాలు కలపడానికి అమ్మగారు అంటించారటండి. పాలు పొంగిపోతూంటే అందుబాటులో పటకా కనబడక కొంగుతో దింప బోయారట. అంతేనండి నైలాను చీ అంటుకుంది. అమ్మగారు కేకలు పెట్టారట. పైన నిద్రపోతున అయ్యగారు పరుగెత్తుకొచ్చే సరికే అమ్మగారు బాగా కాలిపోయార



జో

విన్నటి నుంచీ అయ్యగారు పిచ్చోడిలా ఆస్పత్రి నుండి యింటికీ, యింటినుంచి ఆస్పత్రికీ తిరుగుతున్నారండి" చెప్పాడు డ్రయివర్.

అయిదు నిముషాల తర్వాత.

హాస్పిటల్ ఆవరణలో కారాగింది.

పార్వతమ్మ యేడుస్తూ డ్రయివర్ వెనుక నడిచింది.

శివరామయ్యగారు, సరిత మౌనంగా ఆమెను అనుసరించారు. గుమ్మంలో ఎదురయిన అల్లుడ్ని చూడగానే "బాబూ! అమ్మాయికి ఎలా వుంది?" ఆత్రుతగా అడిగారు శివరామయ్య.

కరుణాకర్ కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. చప్పున ముఖం ప్రక్కకు తిప్పేసుకున్నాడు.

"అమ్మ బాబోయ్! నా కూతుర్ని చూడ నివ్వండర్రోయ్." అని యేడుస్తూ గదిలోకి పరుగెత్తింది పార్వతమ్మ. శివరామయ్య, సరిత అక్కడే ఆగిపోయారు.

లోపలినుంచి వస్తున్న నర్స్ పార్వతమ్మ బుజాలు పట్టి ఆపు చేస్తూ. "మీరలా అరవకూడదమ్మా! ఇప్పుడే ఆవిడకు స్పృహ వచ్చింది. చప్పుడు కాకుండా చూచి వెళ్ళిపోండి." అని కర్టెన్ తొలిగించి పట్టుకుంది.

కూతుర్ని చూచి బావురుమంది పార్వతమ్మ.

"భగవంతుడు నీకెంత అన్యాయం చేశాడే తల్లీ! నిన్నిలా చూస్తూ యింకా నేనెలా బ్రతికున్నానే!" గుండెలు బాదుకుంటూ వంగుని కూతురి ముఖంలోకి ముఖంపెట్టి పిచ్చిదానిలా చూచింది.

మరుక్షణం తల గోడకేసి బాదుకుంటూ "అయ్యోదేవుడా? నన్ను ముందు తీసుకుపో. నేను చూడలేను. భరించలేను!" అని యేడ్వసాగింది.

నర్స్, ఆమె చేయిపట్టుకుని బలవంతంగా గది బయిటికి నడిపించు కొచ్చింది.

పార్వతమ్మ గుమ్మం ప్రక్కనే గోడకానుకుని చతికిల బడి పోయి ముఖం మీద కొంగు కప్పుకుని కుళ్ళి కుళ్ళి యేడుస్తూవుంటే శివరామయ్యగారు, సరిత కొయ్యబారి పోయారు.

శివరామయ్య నిల్చున్న చోటునే పాతుకు పోయినట్లు రాయిలా వుండిపోయారు.

దూరంగావున్న చెట్లను చూస్తూ చేతులు కట్టుకుని గంభీరంగా నిల్చున్నాడు కరుణాకర్.

సరిత చాలాసేపు మౌనంగా నిల్చుండిపోయింది.

ఆ తరువాత మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ గది లోకి వెళ్ళింది. కర్టన్ తొలిగించి చూచింది. ఒళ్ళంతా కాలిపోయి వికృతంగా, నగ్నంగా మంచాన పడివున్న సావిత్రి. భయంతో కెవ్వున అరిచి, గదిలోనుండి ఒక్క పరుగున బయిటి కొచ్చేసి తండ్రిని వాటేసుకుని బావురుమన్నది సరిత. గజగజ వణికిపోతున్న కూతురి వీపు మీద చెయ్యివేసి నిమురుతూ, అప్పటిపరకూ బలవం తంగా అదిమి పెట్టుకున్న దుఃఖాన్ని యిక ఆపుకోలేక, ఉత్తరీయాన్ని నోటి కడ్డం పెట్టుకుని యేడ్చేసారు శివరామయ్య.

క్షణాలు భారంగా దొర్లుతున్నాయి.

"ఆమె గారికి స్పృహవచ్చింది." ఆ మాటతో నలుగుర ముఖాలు తిప్పి ఆదుర్దాగా నర్స్‌వైపు చూశారు.

"మీరేనా సరిత? ఆవిడ మిమ్మల్ని చూడాలంటున్నారు. రండి" అన్నది నర్స్.

భయంగా నర్స్‌వైపు చూచి తండ్రి చేయి గట్టిగా పట్టుకుంది సరిత.

పార్వతమ్మ దిగ్గునలేచి నిల్చుని లోపలికి వెళ్ళబోయింది.

"ఆగండి ఆమె వచ్చాక మీరు." గంభీరంగా అని చేయి అడ్డు పెట్టింది నర్స్.

తెల్లబోయి, అక్కడే ఆగిపోయింది పార్వతమ్మ.

భయం భయంగా సరిత లోపలికి వెళ్ళింది.

అక్కవైపు చూడాలంటేనే ఆమెకి ధైర్యం చాలడం లేదు. యెడంగా నిలబడి పోయిన చెల్లెల్ని చూచి దగ్గరకు రమ్మన్నట్లు కం తోనే సైగ చేసింది సావిత్రి.

దడదడ కొట్టుకుంటున్న గుండెలను చిక్కబట్టుకుని మంచం

ప్రక్కగా వెళ్ళి నిలబడింది సరిత.

"స....రి....తా!" పిలిచింది సావిత్రి.

"అక్కా!" బావురుమన్నది సరిత.

"ఏడవకు....సరితా!....యిలా చూడు...."

"దేవుడెంత నిర్దయుడక్కా!" రెండు చేతులతో మొహాన్ని కప్పుకుని యేడుస్తోంది సరిత.

"దేవుడ్నన్నేం లాభం?....నేనే....ఏదో పాపం చేసుంటాను ....జీవితం మీద ఆశ చావకముందే....చచ్చిపోతున్నాను."

"అక్కా!...."

"సరితా! నాదో....కోరిక....తీరుస్తావా?" ఆయాసపడుతూ అడిగింది సావిత్రి.

ముఖానికి అడ్డు పెట్టుకున్న చేతులు తీసివేసి "చెప్పక్కా!" అంది సరిత రుద్ధ కంఠంతో వెక్కుతూనే.

"అడిగాక....కాదనవుగా!"

"ఊఁ....హు."

"మాట....తప్పవుగా!"

"తప్పనక్కా!"

"నువ్వు....నువ్వు....నా పిల్లలకి....తల్లివి....కావాలి."

"అక్కా!" చిన్న ఆర్తనాదం చేసినట్లు అరిచింది సరిత.

"నా....కోసం....మాట....తప్పవుగా .... నేను....నీకు .... అయినా...." అతి కష్టం మీద చెపుతోంది సావిత్రి. ఆమె రెప్పలు మూతలు పడిపోతున్నాయి. కాలిపోయిన పెదాలు కలుసుకోక మాట స్పష్టంగా రావడం లేదు.

అయినా ఏదో చెపుతూనే వుంది. శబ్దం బయిటికి రావడం లేదు. కాస్త దూరంలో నిల్చుచున్న నర్సు, సావిత్రి మంచం ప్రక్కగా వచ్చి "కాస్సేపు మీరు రెస్టు తీసుకోండమ్మా!" అన్నది.

మూతలు పడిపోతున్న రెప్పలను బలవంతంగా తెరిచి జాలిగా నర్సు వైపు చూచింది సావిత్రి.

ఆ తరువాత ఆమె కనురెప్పలు వాటంతట అవే వాలి

పోయాయి. శిలా ప్రతిమలా నిలబడిపోయిన సరిత చేయి పట్టుకుని గది బయిటికి నడిపించు కొచ్చింది నర్స్.

జరగ వలసిన కార్యక్రమాలు జరిగిపోయాయి.

నిద్రాహారాలు మాని, పిచ్చోడిలా తలుపులు వేసుకుని గదిలోనే కూర్చునుంటున్నాడు కరుణాకర్.

దినాలు జరిపాక అల్లుడ్ని కొన్నాళ్ళు తమతో వచ్చి వుండమని అడిగారు శివరామయ్యగారు. కరుణాకర్ నిరాకరించాడు.

పిల్లల్ని వెంట తీసుకుని ప్రయాణమయ్యారు శివరామయ్య దంపతులు, సరిత.

* * *

ఎప్పుడూ వచ్చేపోయే అతిథులతో, సావిత్రి కూనిరాగాలతో, పిల్లల కేరింతలతో, పనున్నా లేకపోయినా హడావిడిగా తిరిగే నౌకర్లతో సందడిగా వుండే ఆ యింట్లో యిప్పుడు గోడ గడియారం 'టిక్, టిక్' మన్న శబ్దం తప్ప మరే చప్పుడూ లేదు.

విధి లీలలు ఎంత చిత్రం? కొద్ది రోజులలోనే ఎంతమార్పు?! గోడకున్న సావిత్రి ఫోటో వంకే చూస్తూ కూర్చున్నాడు కరుణాకర్. అతని కళ్ళ నిండుగా నీటి పొరలు కమ్మేసి ఫోటో మసకగా కనుపించింది. కళ్ళు మూసుకుని 'సావిత్రీ!' అంటూ నిట్టూర్పు విడిచాడు. అప్పుడే సావిత్రి చచ్చిపోయి యిరవై రోజులయిందన్న సత్యం అతని గుండెల్ని పిండేస్తోంది. లేచి, ఎదురుగా కనిపిస్తున్న గది వరకూ నడిచివెళ్ళి తొంగిచూశాడు. దుమ్ము కొట్టుకునున్న డ్రస్సింగ్ టేబులు కనుపించింది. తనొచ్చేసరికి యీ అద్దం ముందే కూర్చుని వుండేది సావిత్రి. అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచి, ముసిముసిగా నవ్వుకుంటూ దగ్గర కొచ్చేది....

నాలుగు అడుగులు నడిచి ప్రక్క గదిదగ్గర ఆగిపోయాడు. మంచాలన్నీ ఖాళీగా వున్నాయి.

సావిత్రి పిల్లలతో యిక్కడే పడుకునేది. పిల్లలు పడుకున్నాక వాళ్ళని ఆయాకి వప్పగించి మేడమీది కొచ్చేది. సావిత్రి రావడం ఆలస్యమయితే మెట్లమీద నిలబడి త్వరగా రమ్మంటూ

సైగ చేసేవాడు. 'ఉఁష్' అని పెదవుల మీద వేలుంచుకుని చూపేది. "నేను రాను. ఇక్కడే పడుకుంటున్నాను." అని చిలిపిగా సైగలు చేసేది. "అయితే నేనే వస్తున్నా" అన్నట్లు మెట్లు దిగబోతూంటే నవ్వుకుంటూ ఎదురొచ్చేది. అమాంతం ఆమెని చేతుల్లోకి తీసుకుని మెట్లెక్కుతూంటే రెండు చేతులతో తన మెడని చుట్టేసేది.... అక్కడ నిలుచోలేక భోజనాల గది దాటుతూ వంటింటి గుమ్మంలో ఆగిపోయాడు.

సావిత్రి నిలువునా మంటల్లో కాలిపోయిన దృశ్యం కళ్ళకు కట్టినట్లు కనిపించింది. మంటలు ఆర్పడానికి పరుగెత్తి రాబోతుంటే "వద్దు వద్దు. రాకండీ!" అని భయంగా అరుస్తూ చివరికి తన చేతుల్లోనే స్పృహ తప్పి పడిపోయింది సావిత్రి.

కన్నీళ్ళు ఆగలేదు కరుణాకర్‌కి.

గిరుక్కున వెనక్కి తిరిగి గబగబా మెట్లెక్కి పైకి వెళ్ళాడు. మంచం మీద తెరిచి వుంచిన మేరేజ్ ఆల్బమ్‌లో సావిత్రి ఫోటో నవ్వుతూ కనుపించింది.

మెల్లగా ఒకొక్క అడుగే వేస్తూ మంచం వరకూ నడిచి వెళ్ళి వొంగుని ఆల్బమ్ చేతుల్లోకి తీసుకున్నాడు.

"నీ జ్ఞాపకాలతో, ప్రతీక్షణం నేను పిచ్చివాడినై పోతున్నాను సావిత్రీ!" అనుకుంటూ ఫోటో ఆల్బమ్ గుండెల కదుముకుని మంచం మీద వాలిపోయాడు. కళ్ళు మూసుకుని చాలాసేపు అలాగే వుండిపోయాక లేచి, నాలుగు జతల బట్టలు సూట్‌కేస్‌లో పెట్టుకుని క్రిందికి దిగొచ్చాడు.

యజమానిని చూడగానే కారు బయిటికి తెచ్చాడు డ్రయివర్.

రంగన్న పరుగెత్తుకొచ్చి ఎదురుగా నిలుచున్నాడు. అతని చేతికి తాళాలిచ్చి కారెక్కి కూర్చున్నాడు. కారు గేటు దాటగానే "స్టేషన్‌కి పోనీ"—అని సీటుకు జారబడి కళ్ళు మూసుకున్నాడు.

* * *

చెట్లు, గుట్టలు, పొలాలు దాటుకుంటూ శరవేగంతో ముందుకు దూసుకుపోతోంది రైలు. కిటికీ గుండా బయిటికి చూస్తూ కూర్చున్న

కరుణాకర్ దృష్టికి యివేమీ ఆనడంలేదు. ఎన్నిసార్లో యిలా రైల్లో ప్రయాణం చేసాడతను. కానీ, యిలా పారిపోతున్నట్లు ప్రయాణం చేయడం కొత్తగా,చికాకుగా వుందతనికి. మౌనంగా సీటుకు జారబడి కళ్లు మూసుకున్నాడు.

బెంగుళూరు స్టేషన్‌లో రైలుదిగి టాక్సీలో లాడ్జికి చేరుకోగానే కప్పు కాఫీ తాగి కళ్ళు మూసుకుని పడుకున్నాడు. అలసివున్న అతను వెంటనే నిద్రలోకి జారుకున్నాడు.

"ఇక్కడా నిద్రేనా? లేవండీ!" అతని మీదికివొంగి లేపుతోంది ఆమె.

"ఊఁ...." ప్రక్కకి వత్తిగిల్లి పడుకున్నాడు.

"లేవమంటుంటే...."

కళ్ళు మూసుకునుండే చేయి పట్టుకోబోయాడు.

"అబ్బా! ఆశ. అదేం కుదరదు. నేను స్నానం చేసొచ్చేసరికి లేవాలి మరి." ఆమె బాత్‌రూమ్ వైపు నడిచింది. షవర్ చప్పుడు, కూనిరాగం వింటూ అలాగే మంచం మీద పడుకున్నాడు. షవర్ చప్పుడు ఆగిపోయింది. చటుక్కున లేచి, బాత్‌రూమ్ గోడ నానుకుని నిలబడ్డాడు.

బాత్‌రూమ్ తలుపులు తెరుచుకున్నాయి.

గులాబీరంగు టర్కీటవల్ గుండెల మీదినుండి, మోకాళ్ళపైవరకూ చుట్టుకుని వెంట్రుకలను వెనక్కి తోసుకుంటూ అడుగు బయట పెట్టిందామె.

నున్నటి ఆమె జబ్బమీద బలమైన చేయి పడింది.

"సార్! సార్!!" తలుపు చప్పుడు కావడంతో ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూచాడు. ఇదంతా కలన్న మాట అనుకుంటూ లేచివెళ్ళి తలుపు తెరిచాడు.

ఎదురుగా హోటల్ సర్వర్.

"మీల్స్ సార్!" లోపలపెట్టి వెళ్ళాడు.

రెండేళ్ళక్రితం సావిత్రితో కలిసి వచ్చినప్పుడు యీ హోటల్ లోనే దిగాడు తను. ఎంత హాయిగా గడిచిందా రోజు. ఆ నాటి

సంఘటనలు గుర్తుచేసుకుంటూ చాలాసేపు అలానే కూర్చుని గడిపేశాడు.

సాయంత్రం ఆరుగంటల తర్వాత డ్రస్ చేసుకుని బయటికి నడిచాడు. వీధిదీపాలు వెలిగాయి. పార్కులో పిల్లలు ఆడుతూ పిస్తే ఓ క్షణం ఆగి చూచాడు. తిరిగి తలొంచుకుని వేగంగా నడవ సాగాడు.

"కరుణాకర్!" అన్న పిలుపు వినిపించి వెనక్కు తిరిగి చూశాడు. ఓ లావుపాటి వ్యక్తి ఒగుర్చుకుంటూ రావడం గమనించి అతన్నే పరీక్షగా చూస్తూ ఆగిపోయాడు.

అతను బాగా దగ్గరకొచ్చి చప్పున కరుణాకర్ రెండుచేతులూ తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"ఎన్నాళ్ళకి, ఎన్నాళ్ళకి?! నిన్నిలా చూస్తానని అనుకోలేదు. ఏమిటి, నన్నింకా గుర్తుపట్టలేదూ? నేను శర్మని" అన్నాడు.

"ఓఁ సారీ, శర్మా! ఏదో ధ్యాసలో వుండి వెంటనే గుర్తు పట్టలేకపోయాను" ముక్తసరిగా అన్నాడు కరుణాకర్.

"అది నీ తప్పు కాదులే. వెదురుకర్రలా వుండేవాడ్ని ఏనుగులా తయారయ్యాను" అతను నవ్వేశాడు.

"ఆరేళ్ళ తర్వాత అనుకోకుండా కలుసుకున్నాం!" సంబర పడిపోతూ-కరుణాకర్ ప్రక్కనే నడుస్తూ తను లెక్చరర్‌గా పని చేస్తున్నాననీ, భార్య ప్రయిమరీ స్కూల్లో టీచరుగా పని చేస్తున్నదనీ చెప్పుకుపోతూంటే—కరుణాకర్ పరధ్యానంలో వుండి, కొన్ని వినీ, వినకా ఊఁ కొడుతూ నడుస్తున్నాడు.

"కరుణా! నువ్వేం చేస్తున్నావు? పెళ్ళయిందా? ఎంత మంది పిల్లలు?" ఇలా అడుగుతున్న ప్రశ్నలకి పొడిపొడిగా సమాధానా లిచ్చాడు కరుణాకర్.

"ఈ సందులోనే మా యిల్లు రావోయ్" అని అతను ఆప్యాయంగా పిలుస్తూవుంటే కాదనలేక అతనివెంట నడిచాడు.

నలుగురు పిల్లలూ బోర్డుచుట్టూ కూర్చుని కేరమ్సు ఆడు తున్నారు. "ఫాల్స్ స్ట్రయిక్ అని యిద్దరూ, కాదని యిద్దరూ గట్టిగా

అరుస్తూ వాదించుకుంటున్నారు.

"ఏయ్. ఏమిటా గొడవ? ఆపండి" గద్దిస్తూ లోపలికొచ్చిన తండ్రినీ, తండ్రివెనకే లోపలికొచ్చిన నూతన వ్యక్తినీ చూచి పిల్లలు గుప్‌చుప్ అయిపోయారు.

కరుణాకర్ నవ్వుతూ చిన్నపిల్లవాడ్ని దగ్గరకు రమ్మని సంజ్ఞ చేసాడు. వాడు భయం భయంగా అతనివైపు చూచి వెంటనే వీధిలోకి పరుగుతీశాడు.

మిగతా ముగ్గురూ వాడిని అనుచరించారు.

భార్యను కేకేసి పరిచయం చేశాడు శర్మ.

ఆమె భర్తప్రక్కనే కుర్చీలో కూర్చుని "మీ గురించి మావారు చెప్పగా విన్నానండీ! ఆయన ఎప్పుడు చెప్పినా పాతస్నేహితుల గురించేను" అన్నది.

మౌనంగా వుండిపోయాడు కరుణాకర్.

ఆమె లేచి లోపలికి వెళ్ళింది.

రెండు నిముషాల్లో రెండు ప్లేట్లల్లో స్వీట్సు, షరబత్ కలుపు కొచ్చి "తీసుకోండి" అని ఎదురుగావున్న టీపాయ్‌మీద పెట్టి, తనూ ఓ కుర్చీలో కూర్చుంది.

"ఈ వేసవిలో మద్రాసుకన్నా, బెంగుళూరే చల్లగా వుంటుంది. మీ, మిసెస్‌ని కూడా తీసుకురావలసింది" అంది.

శర్మ చెప్పాడు. "పాపం కరుణాకర్ మిసెస్ పోయి ఇరవై రోజులయిందట" అని.

"అరెరే....పాపం. ఎలా?" ఆశ్చర్యపోయింది.

శర్మే చెప్పాడు.

"ఏమిటీ బర్న్‌కేసా? అయితే తప్పక నైలాన్‌చీరే అయి వుండాలి. అవునా అండీ!" కుతూహలంగా అడిగింది.

"చూడండి ఈ నైలాన్ చీరలు వచ్చినప్పటి నుంచీ ఆడవాళ్ల యింటా, బయటా అన్న వివక్షత లేకుండా అవే కట్టడం మొదలు పెట్టేశారు. అందుకే యిలా జరుగుతున్నాయి. ఇంతకీ....ఆవిడ?"

"సుబ్బలక్ష్మి!" తగ్గుస్వరంతో పిలిచాడు శర్మ.

అదేమీ గమనించని సుబ్బలక్ష్మి "అసలెలా జరిగిందండీ? మరి వెంటనే ఆర్పలేకపోయారా? మద్రాసులో పెద్దపెద్ద ఆస్పత్రులే వున్నాయిగా" అంది.

"సుబ్బలక్ష్మీ!...."

"అబ్బ వుండండి. చెప్పుకుంటే సగంబాధ తగ్గుతుందంటారు.

అసలెలా జరిగింది అన్నయ్యగారూ?" తిరిగి ప్రశ్నించింది సుబ్బలక్ష్మి.

అసహనంగా లేచి నిల్చుని "పద కరుణా! అలా వెళ్లొద్దాం!"—శర్మ అనగానే కరుణాకర్ మౌనంగా లేచి అతన్ని అనుసరించాడు.

ఇద్దరూ గుమ్మందాటి వెళ్ళిపోతూంటే మూతి మూడువంకర్లు తిప్పుకుని "ఈ మనిషి ఎప్పుడూ యింతే" అనుకుంటూ ధన్‌మని కుర్చీలో చతికిలబడి, రెండు షరబత్ గ్లాసులూ ఖాళీచేసేసింది సుబ్బలక్ష్మి.

నడుస్తూ సంభాషణ మార్చాడు శర్మ.

"ఆ రోజుల్లో నీతో మాట్లాడటమన్నా, స్నేహం చేయడమన్నా మాకు ఎంత గొప్పగా, గర్వంగా వుండేది. చదువులో స్పోర్ట్స్‌లో ఒకటేమిటిలే. ఒక్క బహుమతి దక్కనిచ్చేవాడివా? అన్నీ నీవేనాయె. ప్రిన్సిపల్‌కి, లెక్చరెర్స్‌కి తలలో తలుకలా వుండేవాడివి" కాలేజీ రోజులు గుర్తుచేస్తూ "అవునూ నీ రూమ్‌లో ఓ ఎర్రటి కుర్రోడుండేవాడు. అతనిప్పుడు ఎక్కడుంటున్నాడు? ఏం చేస్తున్నాడు?" అని అడిగాడు.

"పి. హెచ్. డి. చేస్తున్నాడు" అని సమాధానమిచ్చి ఆ తర్వాత అతని నుంచి సెలవు తీసుకుని రూమ్‌కి వెళ్ళాడు కరుణాకర్. ఆ రాత్రి భోజనం చెయ్యలేదు. సూట్‌కేస్‌లోంచి ఆల్బమ్ తీసి ఒకొక్క పేజీయే తిప్పి చూస్తూ చాలాసేపు గడిపాడు. చివరికి ఆల్బమ్ గుండెల మీద పెట్టుకుని "సావిత్రీ! సావిత్రీ!" అని పలవరిస్తూ నిద్రలోకి జారుకున్నాడు.

* * *

బృందావన్ గార్డెన్స్ రంగురంగుల లైట్లతో కళకళలాడుతోంది. ఎక్కడ చూసినా పిల్లలు, పెద్దలు, జంటలు. ఎవరి ముఖాల్లోకి చూసినా సంతోషం వెల్లివిరుస్తోంది. ఆ వాతావరణం ఆహ్లాదకరంగా వుంది.

చూస్తూ వంటరిగా నిలబడ్డాడు కరుణాకర్.

రెండేళ్ళ క్రితం సావిత్రితో కలిసి అక్కడికి రావడం గుర్తుకొచ్చి అతని మనసు వికలమయింది. నడుస్తూ ఫౌన్‌టెన్ ప్రక్కకొచ్చేసరికి అతని కాళ్ళు టక్కున ఆగిపోయాయి. సరిగ్గా యిక్కడే నడుస్తూ నడుస్తూ తూలి పడిపోబోయింది సావిత్రి. తను చటుక్కున ఆమె బుజాలు పట్టుకుని ఆపాడు. సావిత్రి కళ్ళు మూసుకుని తనని ఆనుకుని నిలబడిపోయింది. తను కంగారుగా "సావీ! ఏమయింది?" ఆమె చెవిలో అడిగాడు.

అదే సమయంలో ఎవరో అపరిచిత యువకుడు ఎదురుగా వచ్చి స్నేప్ తీసాడు. అంతలోనే సావిత్రి తేరుకుని దూరంగా జరిగి సిగ్గుపడుతూ నలువైపులా చూచింది. ఆమెను అక్కడే కూర్చోబెట్టి, గబగబా వెళ్ళిపోతున్న యువకుని వెంబడించి ఆపాడు.

"ఫోటో ఎందుకు తీసావు?" కటువుగా, కోపంగా అడిగాడు.

"అందమైన పోజ్ దొరికింది. తీశాను" నవ్వుతూ సమాధానమిచ్చాడు యువకుడు.

"మర్యాదగా అదిటిచ్చేయ్."

"ఇవ్వకపోతే—"

"నా చేతి రుచి చూడవలసొస్తుంది."

"ఆఫ్టరాల్ నువ్వో టూరిస్టువి. నన్నేం చేయగలవు? నేనొక్క విజిల్ వేస్తే చాలు. నా ఫ్రెండ్సంతా వచ్చేస్తారు. పిలవమంటావా?"

"ఊఁ పిలు. నిన్నూ వాళ్ళనీ కలిపే—" యువకుని చేయి పట్టుకున్నాడు.

అతని ఉక్కుహస్తంలో యువకుడి చేయి నలిగిపోసాగింది. యువకుని మొహంలో రంగులు చకచకా మారసాగాయి. చుట్టుప్రక్కల తారట్లాడుతున్న యువకుని స్నేహితులు ఆ దృశ్యం చూచి మెల్లగా

జారుకున్నారు.

"సారీ సార్! క్షమించండి" ప్రాధేయపడ్డాడు యువకుడు చేయి వదిలేసాడు కరుణాకర్.

లోడ్ చేసిన రీల్, తీసి యిచ్చేసి, వెనక్కి తిరిగి చూడకుండా పరుగుతీసాడు యువకుడు.

తిరిగొచ్చి "సావీ! ఎలావుంది?" మధురస్వరంతో అడిగాడు. అలా అడుగుతున్న భర్త ముఖంలోకి బెదురుగా చూసింది సావిత్రి.

"ఏమిటి అలా చూస్తున్నావ్? లేచి నడవగలవా?" నవ్వుతూ చేయి అందించాడు.

ఆ బలమైన చేతిని అందుకుని లేచి నిలుచుంది సావిత్రి. ఆమె కోమల హస్తాన్ని స్నేహపూర్వకంగా. మృదువుగా నొక్కి-వొదిలాడు. ఆ వెచ్చని చేతి స్పర్శకి పులకరించింది సావిత్రి హృదయం. క్షణం క్రితం యువకునికి గుణపాఠం చెప్పింది యీ చేయేనా అనుకుంది. ఆ మాటే అతని చెవిలో చెప్పింది సావిత్రి.

బరువుగా నిట్టూర్పు విడిచాడు.

మరుచటిరోజు బొంబాయికి ప్రయాణమయ్యారు. అక్కడ అవే జ్ఞాపకాలు. జ్ఞాపకాలు కళ్ళముందు కదలాడుతున్నంతసేపూ అదోరకం నిషాలో వున్నవాడిలా కదులు, మెదులు లేకుండ కూర్చుంటాడు. జ్ఞాపకాల పుటలకి అంతరాయం యేర్పడగానే వాస్తవం కళ్ళముందు ప్రత్యక్షమవుతుంది. ఒంటరితనం....బాధ.... విరక్తి. మళ్ళీ అక్కడినుంచి ప్రయాణం. తిరిగి తిరిగి అలిసిపోయాడు. విసిగిపోయాడు. చివరికి అనుకున్నాడు. "ఆమె స్మృతులనుంచి దూరంగా పారిపోతే మనఃశాంతి లభిస్తుందని భ్రమపడ్డాను. కానీ అది పొరపాటు. సావిత్రి నాలోనే శాశ్వతంగా వుంటుంది. ఆ తీయని స్మృతులు చాలు శేష జీవితాన్ని గడిపేయడానికి" ఇలా నిర్ణయించుకొని తిరుగు ప్రయాణానికి టికెట్ రిజర్వు చేయించుకున్నాడు.

*　　*　　*

కాలచక్రంలో మూడు నెల్లు గిర్రున తిరిగిపోయాయి.

పార్వతమ్మ కూతురుపోయిన దుఃఖంనుండి కొద్దిగా తేరుకుంది. శివరామయ్యగారు ముభావంగా మౌనంగా వుంటున్నారు. సరితకి పిల్లలు బాగా అలవాటు పడ్డారు.

మధ్యాహ్నం రెండుగంటల సమయం.

ప్రక్కింటి మీనాక్షమ్మ, పార్వతమ్మ యింటికొచ్చి సావకాశంగా ఆకులు నములుతూ, గోడకి జారబడి కూర్చుని సంభాషణ ప్రారంభించింది. "ఒదినా! పిల్లల్ని తీసుకొచ్చి మూడునెల్లయింది గదా. మీ అల్లుడు ఒక్క ఉత్తరం ముక్క వ్రాసాడూ?"

"లేదు" పొడిగా అని వూరుకుంది పార్వతమ్మ.

"తల్లిలేని పిల్లలుకదా! ఎలా వున్నారో, ఏంటోనని తండ్రన్న వాడికి అజ లేకపోతే ఎలా చెప్పు?"

"మేం మాత్రం వ్రాసామేమిటి?"

"మీరు వ్రాయలేదంటే అది వేరే విషయం. అతను కన్న తండ్రి కదా!"

పార్వతమ్మ సమాధానం యివ్వలేదు.

"ఒదినా? డబ్బేవయినా పంపాడా?" ఏదో రహస్యం చెపుతున్నట్లుగా గొంతు తగ్గించి అడిగింది.

లేదన్నట్లు తలూపింది పార్వతమ్మ.

"అయ్యో! ఆమాత్రం తెలీదేవిటి మీ అల్లుడికి? ఇద్దరు పసిపిల్లల్ని పెంచడమంటే మాటలా?" సాగదీస్తూ అన్నది.

"ఏదో మాతోపాటే వాళ్ళూను" నిట్టూరుస్తూ సమాధానమిచ్చింది పార్వతమ్మ.

"అంహా( నేననేది అదికాదు. మూడు నెల్లనుంచీ ఉత్తరం ముక్క వ్రాయనివాడు, ఆ తర్వాత మాత్రం పిల్లల విషయంలో శ్రద్ధ తీసుకుంటాడా? అని." పార్వతమ్మ మౌనం వహించింది.

"చూడు పార్వతమ్మా! ఈకాలపు కుర్రకారు సంగతి మనకి తెలియందేమీ కాదు. అబ్బాయి డబ్బుగలవాడు. వయసులో ఉన్నాడు. అతనికి మాత్రం పెళ్ళయి రెండేళ్ళాగా అయింది. పాపం. అప్పుడే ఏం అచ్చట, ముచ్చట తీరిందని? మళ్ళీ పెళ్ళి చేసుకుంటే కొత్త

పెళ్ళాం, కొత్త మోజు. ఇక పిల్లల సంగతి ఆలోచించు" ఉన్నట్లుండి స్వరం తగ్గించి పార్వతమ్మకి దగ్గరగా జరిగి "ఒదినా! పోనీ అతనికి సరితనిచ్చి చేస్తేనో!" రహస్యం చెపుతున్నట్లుగా అంది.

ఉలిక్కి పడింది పార్వతమ్మ.

మీనాక్షమ్మ రహస్యంగా అన్నాననుకున్న మాట వరండాలో పిల్లకి పాలు పడుతున్న సరిత చెవిలో పడింది.

సరిత గుండె ఒక్కసారి ఆగినట్లయింది. ఇలా అనుకుంది. "అక్క అన్నమాట యిప్పటివరకూ తనలోనే దాచుకుంది. మూడు నెల్లనుంచీ ఆలోచిస్తూనేవుంది. మనసుతో ఘర్షణ పడుతూనేవుంది. అయినా తను ఒక నిర్ణయానికి రాలేకపోతున్నది."

"ఒదినా! ఆలోచించు. మీకుమాత్రం వెనకా ముందూ ఏం వుంది కనుక. సరితకి యింతకన్నా మంచి సంబంధం తేగలరా? కాకపోతే వయసులో కొంత తేడా వుంటుంది. ఉంటేమాత్రం ఏం? అక్కపిల్లలు కదా అని వాళ్ళని కడుపులో దాచుకుని చూసుకుంటుంది."

పార్వతమ్మ కళ్ళప్పగించి వింటోంది.

"ఆఁ నాకు తోచిందేదో చెప్పాను. అలా జరుగుతేమటుకు ఇటు పిల్లలు, అటు సరితా యిద్దరూ బాగుపడతారు. ఈ వయసులో యిక మీరు దిగులుపడుతూ కూర్చోవలసిన అవసరమూ వుండదు. ఆలోచించుకోండి" అనేసి అక్కడ్నించి లేచి "నే వెళ్ళొస్తానమ్మా" అంటూ వెళ్ళిపోయింది.

పార్వతమ్మ ఆలోచనలో పడింది.

* * *

తలుపులు తెరుచుకుని లోపలికి అడుగుపెట్టిన కరుణాకర్‌కి ఎదురుగా సావిత్రి ఫోటో కనుపించింది. పటానికి వేసిన మల్లెపూ దండ వాడిపోయింది. కొన్ని పూలు నేలమీద రాలి పడున్నాయి. చుట్టూ కలయచూసాడు. ఎక్కడ పడితే అక్కడ దుమ్ము, బూజు వ్రేలాడుతోంది. ఇల్లాలు లేని ఆ యిల్లు, దేవుడు లేని గుడిలాగా బోసిగావుంది.

వేడి నిట్టూర్పులు విడుస్తూ ఒక్కొక్క మెట్టే ఎక్కి గది చేరుకున్నాడు కరుణాకర్.

ఫోన్ మ్రోగింది.

రిసీవర్ అందుకున్నాడు.

"గుడ్‌మార్నింగ్ కరుణాకర్!"

అవతలి కంఠస్వరం గుర్తుపట్టి "గుడ్‌మార్నింగ్ సార్" అన్నాడు.

"నువ్వు వచ్చావని రంగన్న చెప్పాడు"....తర్వాత ఏం మాట్లాడాలో వర్మగారికి తోచలేదు. క్షణం మౌనంగా వుండి పోయారు. ఆ తర్వాత మెల్లగా అన్నారు. "మేం పూర్నించి రాగానే యింతటి చెడువార్త వింటామనుకోలేదు. సమయానికి ఊర్లో లేకపోయామని మిసెస్ వర్మ చాలా బాధపడింది" కరుణాకర్ మాట్లాడలేదు.

"మిసెస్ వర్మభోజనానికి నిన్నుయిక్కడికే రమ్మంటున్నది."

ఈసారి ఆయన గొంతు మామూలుగా పలికింది.

"క్షమించమనండి. రాలేను!"

"ఆవిడ యిక్కడేవుంది. నీతో మాట్లాడుతుందట."

ఫోన్ భార్య చేతికిచ్చారు వర్మ.

"కరుణ్‌బాబూ! ఏమిటి? రానంటున్నావా? అదేం కుదరదు. వెంటనే బయల్దేరి వచ్చేయ్" ఫోన్ పెట్టేసి కళ్ళు తుడుచుకుంది మిసెస్ వర్మ.

కారు దిగొస్తున్న కరుణాకర్‌ని చూస్తూ, మెట్లమీదే బొమ్మలా నిలబడిపోయారు లెఫ్టినెంట్ కల్నల్ వర్మ, ఆయన భార్య తులసి. ఇస్త్రీ బట్టల్లో ఠీవిగా దర్పంగా చిరునవ్వులు చిందించుకుంటూ నడిచి వచ్చే అతను—నలిగిన బట్టల్లో కృంగిపోయినట్లు తలొంచుకుని అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి అలవాటుగా కొద్దిగా తలెత్తి విష్ చేసాడు.

గుంటలు పడిపోయాయి కళ్ళు. పీక్కుపోయిన ముఖంలో ముక్కు మరీ కొట్టొచ్చినట్లు కనబడుతూంది.

"నువ్వింత పిరికివాడివనుకోలేదోయ్! యుమస్టబి బోల్డ్."

వర్మ, అతని భుజంమీద చేయివేసి లోపలికి తీసుకెళ్ళాడు. సావిత్రి ప్రసక్తి ఎత్తితే మానుతున్న గాయాన్ని తిరిగి రేపినట్లవు తుందని మిసెస్ వర్మ ఆ ప్రసక్తే ఎత్తలేదు. లోపలికి వెళ్ళి గట్టిగా కళ్ళు తుడుచుకొచ్చి "ఇక భోజనానికి లేవండి" అంది.

భోజనాలు ముగిశాక విశ్రాంతిగా సోఫానానుకుని కూర్చుని భార్య అందించిన ఒక్కపొడి నోట్లో వేసుకుంటూ కరుణాకర్‌వైపు చూశారు వర్మ.

ఆయన మనసు కలుక్కుమంది.

"చిన్నప్పుడు చదివిన బుద్ధుడి కథ ఒకటి గుర్తొస్తున్నదోయ్. కరుణాకర్! ఆవిడపేరు గుర్తులేదు. చనిపోయిన కొడుకుని బ్రతికించ మని బుద్ధ భగవానుని ప్రార్థిస్తుంది. ఆయన 'అలాగే బ్రతికిస్తాను గానీ నువ్వు దుఃఖమెరుగని యింటినుంచి గుప్పెడు మెంతిగింజలు తెచ్చిపెట్టు' అంటారు. ఆమె మూడు రోజుల తర్వాత తిరిగొచ్చి బుద్ధుని పాదాలమీద పడి 'నా కళ్ళు తెరిపించారు. నన్ను క్షమించండి స్వామీ!' అంటుంది. ప్రపంచంలో కష్టాలులేనిదెవడికి చెప్పు. బాధలన్నిటినీ గుండెల్లోనే అదిమిపెట్టి పైకి నవ్వుతూ బ్రతికేయాలి" అంటూ అకారణంగానే నవ్వేసారు వర్మ.

కరుణాకర్ వర్మగారివైపు అరక్షణం చూచి తలదించు కున్నాడు.

ఆ తరువాత సంభాషణ మార్చారు వర్మ. పావుగంట గడిచాక వాచీ చూసుకుని లేచారు.

ఆయనతోపాటే కరుణాకర్ లేచి నిలబడ్డాడు.

"కాస్సేపు కూర్చుని వెళ్ళరాదూ!" అంది అప్పుడే అక్కడి కొచ్చిన మిసెస్ వర్మ, కరుణాకర్‌ని వుద్దేశించి.

లేచినవాడు తిరిగి కూర్చున్నాడు.

వర్మ వెళ్ళిపోయారు.

"ఇప్పుడే వస్తావుండు" అని లోపలికి వెళ్ళింది మిసెస్ వర్మ.

మిసెస్ వర్మ పండిన జామపండు ఛాయతో పొట్టిగా,

బొద్దుగా వుంటుంది. ఆమె వయసు నలభై ఐదు దాటినా ఎప్పుడూ తెల్లని నైలానుచీర, తెల్లని స్లీవ్‌లెస్ బ్లవుజ్ వేస్తుంది. పెద్దముడి. నుదుట ఎఱ్ఱని తిలకం, సన్నని పెదాలకు ఎర్రని లిప్‌స్టిక్‌తో ఎప్పుడూ నవ్వుతూ హుషారుగా వుంటుంది. కరుణాకర్ అంటే, ఆమెకి ఎనలేని అభిమానం. భుజంమీద చేయి పడటంతో తలెత్తి చూశాడు.

మిసెస్ వర్మ ఫోటో ఒకటి అందించింది.

ఇరవై ఏళ్ళ యువకుడు. నూనూగు మీసాలు. కోటేరు ముక్కు. చురుకైన పెద్ద పెద్ద కళ్ళు. అందమైన క్రాపు. భారీ విగ్రహం. చేతులూ, చేతివ్రేళ్ళూ పొడవుగా వున్నాయి.

నవ్వుతూవున్న అతను గ్రీకు రాజకుమారుడిలా వున్నాడు.

ఆమె కరుణాకర్ కెదురుగా నిలబడి, అతని మొహంలోకే సూటిగా చూస్తూ "మా అబ్బాయి 'వంశీ' నీలాగే వున్నాడు కదూ!" అంది.

'అవున'న్నట్లు తలూపాడు.

"మా పెళ్ళయిన ఏడాదిలోపే పుట్టాడు వంశీ"....కరుణాకర్ ప్రక్కనేవచ్చి కూర్చుని చెప్పడం ప్రారంభించింది.

"బాబుని ప్రాణంగా చూసుకునేవారు వర్మగారు. నాలుగో యేటే స్కూల్లో వేశాను. వంశీ చదువుల్లో ఆటల్లో ఒకటేమిటి అన్నిట్లోనూ చురుగ్గా వుండేవాడు. హైస్కూల్లో వుండగానే వంశీకి హన్‌టింగ్, ఫెరింగ్, షూటింగ్ నేర్పారు. ఇంటికొచ్చి 'వాడు నన్నే మించిపోతున్నాడు. నాకే పాఠాలు నేర్పేలా వున్నాడని' మురిసిపోయేవారు. వాడిమీద ఎన్నో ఆశలు పెట్టుకుని కలలు కనేవారు. వంశీ తండ్రిమాట కెదురుచెప్పేవాడుకాదు. ఎక్కువ ఆయన వెనుకే తిరిగేవాడు. 'చూశావా నా కొడుకు' అని పొంగిపోయే వారు. కానీ, భగవంతుడు మాకా సంతోషం ఎక్కువ రోజులు దక్కనీయలేదు."

ఆమె చెప్పటం ఆపగానే తలెత్తి చూచాడు కరుణాకర్. ఆమె కొంగుతో కళ్ళు తుడుచుకుని తిరిగి ప్రారంభించింది. "వంశీ బి.ఎ. పరీక్షలు వ్రాసి స్నేహితులతో నార్త్ ఇండియా టూర్ వెళతా

న్నాడు. వంశీ అడిగినదానికన్నా ఎక్కువ డబ్బిచ్చి, మరో నాలుగు జతలు బట్టలు కొనిచ్చి స్వయంగా పెట్టెసర్ది వంశీ వెళ్ళేరోజు నానా హడావిడీ చేసేసారు. తండ్రి కోరికప్రకారం రెండు రోజులకో ఉత్తరం వ్రాసేవాడు వంశీ.

అందులో తను చూచిన స్థలాలని ఎంతో చక్కగా కళ్ళకి కట్టినట్లు వర్ణించేవాడు. ఉత్తరం చివర మమ్మీకి అని నాకు విడిగా వ్రాసేవాడు. అలా వాడి దగ్గరనుంచి రెండు రోజులకో ఉత్తరం వస్తూవుంటే యీయన చదివినదే పదిసార్లు చదువుకుని మురిసిపోయే వారు. అలా రెండు నెలలు గడిచిపోయాయి. ఓరోజు వంశీనుంచి ఫలానా ట్రయిన్‌కి వస్తున్నాము అన్నట్లు ఉత్తరం వచ్చింది. ఈయన సంబరానికీ సంతోషానికీ అంతులేదు. టేబుల్ మీదున్న వంశీ ఫోటోతీసి ముద్దు పెట్టుకున్నారు. వాడికి యిష్టమయిన వంటలవీ చేసి వుంచమని నాకు పురమాయించారు. ఆయన హడావిడి చూచి నవ్వుకుంటూనే ఆయన చెప్పినవన్నీ చేసాను. ఆ మధ్యాహ్నం ఆయన యింటికి రాలేదు——"ఆమె గొంతు గాద్గదిక మయింది.

చెప్పడం ఆపి, ఒక్క నిముషం బాధగా కళ్లు మూసుకుని తిరిగి ప్రారంభించింది.

"ఇంటికొచ్చిన జవాను చెప్పాడు. చిన్నబాబుగారు వస్తున్న రైలు దారిలో పట్టాలుతప్పి పడిపోయిందట. చాలామందికి గాయాలు తగిలాయట. ఈ సంగతి తెలియగానే అయ్యగారు కారుతీసుకుని హుటాహుటి అక్కడికి వెళ్ళిపోయారు అని."

ఆమె కళ్ళవెంట జలజల నీళ్ళు కారిపోతున్నాయి.

"ఎంతమందో దేవుళ్ళకి మొక్కుకున్నారు. కరుణ్ బాబూ! నా వంశీ క్షేమంగా తిరిగిరావాలనీ, వాడికే గాయాలూ తగలకుండా వుండాలనీను. ఏక్షణంలోనైనా ఆయన, వంశీ నవ్వుతుంటూ వస్తారని వాళ్ళకోసం ఎదురుచూస్తూ ఆ రాత్రంతా వరండాలో కూర్చునే గడిపారు! తెలతెలవారుతుండగా ఎప్పుడు రెప్పలంటు కున్నాయో తెలీదు. కారు లోపలికొచ్చిన శబ్దంవిని దిగ్గున కళ్లు తెరిచి చూచాను. కారు పోర్టికోలో ఆగివుంది. ఆయన స్టీరింగ్ మీద

తలపెట్టుకుని కూర్చుని వున్నారు. భయంతో పరుగెత్తుకెళ్ళి కార్లోకి తొంగి చూచాను. బేక్‌సీట్లో వంశీ శవం-" తనని తాను అదుపులో పెట్టుకోడానికి కాస్సేపు మౌనంగా వుండిపోయిందామె.

"మూడోరోజు స్పృహ వచ్చింది. నా గదిలో మంచంమీదే పడుకుని వున్నాను"....తిరిగి చెప్పసాగింది.

"వంశీ ఏమయ్యాడు? చూడనివ్వండి నా బాబుని" అనుకుంటూ లేని ఓపిక తెచ్చుకుని పిచ్చిదానిలా ఆయన గదివైపు పరుగుతీశాను.

నే చూచిన దృశ్యం ఆయన వంశీ ఫోటో ఒడిలో పెట్టుకుని "వంశీ!....బాబూ! నన్నొదిలి వెళ్ళిపోయావా?" అంటూ ఆ ఫోటో గుండెల కదుముకుని యేడుస్తున్నారు.

ఆయన కాళ్ళని చుట్టేసి బావురుమని యేడ్చేసాను....రాయిలా వుండే వన్మగారు గుర్తు పట్టలేనట్లు మారిపోయారు. ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతింది... ఆయన కోసం నేను. నాకోసం ఆయన వంశీని మరిచిపోయినట్లు నటించడం నేర్చుకున్నాము. తర్వాత పూనానుంచి మద్రాసు ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వచ్చేసాం. ఏమిటో ఊరయితే విడిచిపెట్టి రాగలిగాం గానీ, వంశీని మర్చిపో గలిగామా?"—భారంగా నిట్టూర్చిందామె.

"వంశీ పుట్టిన రోజు యిప్పటికీ చేస్తూనే వుంటారు. పోయిన సంవత్సరం నువ్వు చూశావుగా తెలీనివారు 'మీ అబ్బాయి ఏడండీ అంటే' "వాడు నామీద అలిగి వెళ్ళిపోయాడు. ఏదో వోరోజు వస్తాడు. అంతగావాడు రాకపోతే నేనే వాడ్ని వెతుక్కుంటూ వెడతాను." అంటారు.

ఆమె తడి కళ్ళు తుడుచుకుంది.

"ఏచీకూ, చింతా లేకుండా హాయిగా వుంటారనుకునే యీ వృద్ధ దంపతుల వెనుక యింతటి విషాదగాథ వుందా!" నిట్టూర్చాడు కరుణాకర్.

"కరుణ్ బాబూ! నిన్ను చూచిన రోజు వంశీ తిరిగి వచ్చినంత సంబర పడిపోయారు. నిన్ను నాకు చూపించి వంశీవుంటే యిప్పుడు యింతయి, యిలా వుండేవాడు కదూ! అంటూ కంట

తడి. పెట్టుకున్నారు. వంశీ బ్రతికుంటే మిమ్మల్నిద్దరినీ ప్రక్క ప్రక్కన చూచినవారు కవలలనుకోక తప్పదు. మాకు దూరమయి పోయిన వంశీని నీలో చూచుకుని తృప్తిపడుతున్నాము. భగవంతుడు నీకు తీరని అన్యాయం చేసాడు. మా కళ్ళముందే నువ్విలా కుమిలి పోతూంటే చూస్తూ సహించలేం. మాకోసమైనా నువ్వు మళ్ళీ మామూలు మనిషివి కావాలి బాబూ!" అంటూండగా ఆమె కళ్ళ వెంట కారిన అశ్రువులు అతని చేతిమీద పడ్డాయి.

తలెత్తి చూచాడు.

ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి.

మిసెస్ వర్మ చప్పున తేరుకుని "నువ్వే బాధలో వుంటే మా బాధలన్నీ వినిపించి నీమనసు మరింత కష్ట పెట్టాను. ఏమీ అనుకోకు బాబూ!" అంది.

"లేదమ్మా! లేదు. మిమ్మల్ని అర్థం చేసుకునే అవకాశం కల్పించావు. కన్నతల్లి ప్రేమ ఎరుగని నాకు భగవంతుడు అనురాగ మయి అయిన తల్లిని ప్రసాదించాడు."

సున్నితంగా ఆమె కళ్ళు తుడిచాడు.

"బాబూ?" ఆమె కళ్ళవెంట ఆనంద బాష్పాలు రాలాయి. ఇంకాస్సేపు అక్కడే గడిపి చీకటి పడుతుండగా యింటికి బయల్దే రాడు కరుణాకర్.

*　　　*　　　*

ఆఫీసుకి వెళ్ళడానికి క్రిందికి దిగివచ్చాడు కరుణాకర్.

అప్పుడే చేతి సంచితో లోపలికి ప్రవేశించారు పట్టాభి రామయ్య.

"మీరు వస్తున్నట్లు లెటర్ వ్రాసుంటే స్టేషన్‌కి కారు తెచ్చే వాడిని కదండీ!" తండ్రికి ఎదురెళ్ళి నొచ్చుకుంటూ అన్నాడు.

"ఆ....ఏం కారు తేవడమో. నాలుగు ఉత్తరాలు వ్రాసినా సమాధాన మివ్వని వాడివి కారు తెస్తావని ఎలా అనుకోను?" విసు క్కుంటూ అలసటతో సోఫాలో కూర్చున్నారు.

"ఊర్లోలేను...."

ఆ సమాధానానికి పట్టాభిరామయ్య తలెత్తి, అద్దాలలోనుంచి కొడుకుని సూటిగా చూశారు.

"ఏమో నీకు కోపం వచ్చుంటుందనుకున్నాను. సావిత్రి పోయినప్పుడు నా ఒంట్లో బొత్తిగా బాగోక రాలేక పోయాను." అన్నారు. కరుణాకర్ మౌనంగా వుండిపోయాడు.

కరుణాకర్ పెళ్ళయ్యాక పరంధామయ్య రావడం యిదే మొదటిసారి. తను చూచిన సంబంధం కాదని, ఎవరో మధ్యవర్తి తెచ్చిన సంబంధం ఒప్పుకున్నాడని కొడుకు మీద కోపం వచ్చింది. ఏమీ అనలేక యిష్టం లేకపోయినా పెళ్ళి పటుకు దగ్గరుండి జరిపించారు.

"ఊఁ ఎక్కడికి? ఆఫీసు కేనా?"

"అవునండీ!"

"ఈరోజు సెలవు పెట్టకూడదూ?"

"రెండు నెల్లనుంచీ సెలవులోనే వున్నాను. ఈ రోజు డ్యూటీలో చేరాలి. మీరు స్నానంచేసి విశ్రాంతి తీసుకోండి. ఈ లోగా వచ్చేస్తాను...."

కరుణాకర్ మాటకి సమాధాన మివ్వలేదు పట్టాభిరామయ్య. కరుణాకర్ వెళ్ళిపోయాడు.

రంగన్న అందించిన వేడివేడి కాఫీత్రాగి, స్నానం చేసొచ్చి ఓ సారి యిల్లంతా కలియతిరిగారు. గదులన్నీ తెరిచివున్నాయి ఇనప బీరువా తెరిచి చూచారు. సావిత్రి విలువైన చీరలు హేంగర్లకు వ్రేలాడుతున్నాయి. మరికొన్ని విలువైన వస్తువులు బయటే వున్నాయి. ఇంట్లో యింతమంది నౌకర్లు తిరుగుతుంటే యిల్లంతా యిలా ఒదిలేసి వుంచుకుంటాడా? భార్యపోయాక వీడికి బొత్తిగా మతి పోయినట్లుంది. అనుకుని గది తలుపులు దగ్గరకు లాగిపెట్టి గడియ పెట్టి వచ్చి సోఫాలో కూర్చున్నారు.

రంగన్న మనసులోనే నవ్వుకున్నాడు.

భోజనం ముగించుకుని పడుకున్న పట్టాభిరామయ్య మధ్యాహ్నం మూడుగంటలకు లేచి ముఖం కడుక్కుని, రంగన్న

అందించిన కాఫీ ఫలహారం సేవించి ఇంటిముందు తోటలో వాలు కుర్చీ వేయించుకుని కూర్చున్నారు.

ఆరుగంటల సమయంలో కరుణాకర్ వచ్చాడు. రావడమే తండ్రి దగ్గరకు వెళ్ళి ఆలస్యమయినందుకు సంజాయిషీ చెప్పు కున్నాడు. రాత్రి భోజనాల దగ్గర అడిగారు పట్టాభిరామయ్య.

"పిల్లల్ని యింకా ఎన్నాళ్ళుంచుతావ్ అక్కడ?"

"..............."

"డబ్బేమయినా పంపేవా?"

తనకా ఆలోచనే తట్టనందుకు నొచ్చుకుంటూ "లేదు"అన్నాడు.

"శివరామయ్య అంత వున్నవాడేంకాదు. నీ పిల్లలకి ఏలోటూ లేకుండా పెంచడానికి. అయినా ఎవరి పిల్లలు వాళ్ళదగ్గరుంటే మంచిది" నీళ్ళగ్లాసు అందుకుంటూ కొడుకువైపు చూశారు.

కరుణాకర్ మౌనాన్ని చూచి తినడం ఆపి సూటిగా అసలు విషయం బయటపెట్టారు.

"పుల్లయ్యగారని భూకామందు వున్నాడు. ఆయనకి ఒక్కగా నొక్క కూతురు. బి. ఎ. చదివిందట. పిల్ల బాగుంటుంది. అతని తదనంతరం వారసురాలు ఆ పిల్లే అవుతుంది. నిన్నడిగి మాటిద్దామని వూరుకున్నాను—"

కరుణాకర్‌కి భోజనం సహించడంలేదు. అన్నం కెలుకుతూ కూర్చున్నాడు.

"ఇంతకీ నే చెప్పేదేమిటంటే—" తిరిగి ప్రారంభించారు పట్టాభిరామయ్య.

"ఆ పిల్లపోయి యింకా ఎన్నాళ్ళో కాలేదు గాబట్టి నువ్వింకా బాధపడుతున్నావు. ఇంకో నాలుగురోజులు పోతే నువ్వే మర్చి పోతావు. మీ అమ్మ పోయిన కొత్తలో నేనెంత కుమిలిపోయాను. అప్పటికి నువ్వు మూడేళ్ళ పసివాడివి. నిన్ను పెంచడానికి, యింట్లో అజమాయిషీకి ఆడదిక్కు అవసరమనుకుని మీ పిన్నిని చేసుకోలేదూ?"—

కరుణాకర్ కంచం ముందు నుంచి వెళ్ళిపోయాడు. కొడుకు

ప్రవర్తనకి విస్తుపోయి చూచి గబగబా నాలుగు ముద్దలు తినేసి తనూ చేయి కడుక్కొచ్చి సోఫాలో కూర్చున్నారు పట్టాభిరామయ్య.

కరుణాకర్ సోఫా చివర్లో కూర్చుని ఆరోజు పేపర్ చూస్తున్నాడు.

"చూడు....ఇల్లంతా నౌకర్లపాలు చేసి, నువ్వు ఊళ్లట్టుకు తిరగడం ఏం బాగోలేదు. అందుబాటులో వుంటే ఎవరికైనా దుర్బుద్ధులు పుడతాయి. నామాట విను. ఇప్పుడు కాకపోయినా కొన్నాళ్ళకయినా పెళ్ళిచేసుకోక తప్పదు. నువ్వు 'ఊఁ' అంటే వాళ్ళు ఆగుతారు...."

"నాకా వుద్దేశం లేదండీ!" పేపరు వెనుకనుంచే జవాబిచ్చాడు.

చివాల్న లేచారు పట్టాభిరామయ్య.

"ఆఁ వుద్దేశం లేదూ? అయితే నీ వుద్దేశం ఆ పిల్లనే తలుచుకుంటూ వుండిపోదామనా?"

కరుణాకర్ మౌనం వహించాడు.

"అలా కాలి చచ్చిపోవాలని ఆపిల్ల నొసట రాసుంటే యెవరు తప్పించ గలరు? ఇక అవన్నీ మర్చిపోవాలి. ఈ రోజుల్లో మొగుడు చచ్చిన మూడోరోజే మళ్ళీ పెళ్ళికి సిద్ధమవుతున్నారు ఆడముండలు. అటువంటిది ముప్ఫై ఏళ్ళకే అలా వుండిపోడానికి నువ్వేమయినా ఋషివా? బైరాగివా?"

పచార్లు చేస్తూ కోపంగా అన్నాడు.

"ఇప్పుడీ విషయాలెందుకు? మీరు విశ్రాంతి తీసుకోండి" లేచి నిలబడ్డాడు కరుణాకర్.

పచార్లుచేస్తున్న పట్టాభిరామయ్య టక్కున ఆగిపోయారు. ఆయన బి.పి. రేజ్ అయింది.

"ఏమిటి?! విశ్రాంతి తీసుకోవడానికా యీ వయసులో పడుతూ లేస్తూ యింతదూర మొస్త. నీ సంసారం చక్కదిద్దాలనీ, నిన్ను తిరిగి వో యింటి వాణ్ణి చేయాలనీ వస్తే యిలాగేనా నువ్వు మాట్లాడేది? మీఅమ్మే బ్రతికుంటే నిన్నిలా వొదిలేసేదీనా?" అరుస్తూ కొడుకు

ముందుకొచ్చి నిలుచున్నారు.

కరుణాకర్ వంచిన తల ఎత్తలేదు.

"చూడు. నువ్విలా మూగవ్రతం పట్టి మాట్లాడకపోతే బాగుండదు. కన్నతండ్రిని, నాకు గాక నీ బాగోగులు ఎవరిక్కావాలి? ఆ పిల్లల్ని ఎన్నాళ్ళని పరాయిపంచల్లో వుంచుతావు? ఇంటికి దీపం ఇల్లాలే. ఆడదిక్కులేని యిల్లు దెయ్యాల కొంపలా తయారవుతుంది. ఆః ఇప్పుడు కాకపోతే తెలిసొచ్చాక బాధపడి ప్రయోజనంలేదు. రేపు నేను వెళ్ళిపోతున్నాను. ఆలోచించుకొని సమాధానం వ్రాయి" కోపంగా అనేసి తపతప అడుగులు వేసుకుంటూ వెళ్ళి తనకని యేర్పాటుచేసిన పక్కమీద పడ్డారు.

కరుణాకర్ తన గదిలో కూర్చుని మామగారి పేర పిల్లల్ని చూడాలనివుందనీ. వారి క్షేమాలు తెలియజేస్తే వీలు చూసుకుని ఒక సారి పిల్లల్ని తీసుకొచ్చి చూపిస్తే బాగుంటుందనీ, ఉత్తరం వ్రాశాడు.

ఆ తరువాత సావిత్రి ఫోటో పట్టుకుని మంచంమీద వాలిపోయాడు. ఫోటోని ముఖానికెదురుగా పెట్టుకుని "చూసావా సావిత్రీ! నాన్నేమంటున్నారో? నేను, నిన్ను మర్చిపోతానట. నువ్వు చెప్పు. నిన్ను మర్చిపోగలనా? మన పిల్లలగురించే ఆలోచిస్తున్నాను సావిత్రీ!" అలా యేవేవో అనుకుంటూ సావిత్రిఫోటోని గుండెల మీద పెట్టుకుని నిద్రలోకి జారిపోయాడు.

*  *  *

పోస్టుమాన్ అందించిన ఉత్తరం తీసుకుని, మనియార్డర్ రసీదుమీద సంతకం చేసి వేయిరూపాయలు లెక్కపెట్టి తీసుకున్నారు శివరామయ్య.

లోపలికొస్తుండగా ఆయన చేతిలోని ఉత్తరాన్ని, రూపాయి కాగితాల్ని చూసిన పార్వతమ్మ "ఎక్కడ్నించి?" అడిగింది.

శివరామయ్య రూపాయినోట్లను బల్లమీద పెట్టి, వాటిమీద బరువు పెట్టారు.

కవరు విప్పుతూ "అల్లుడి దగ్గర్నుంచి" అన్నారు.

"మరి డబ్బు?"

"అదీ అతనే పంపాడు."

"ఇన్నాళ్ళకి గుర్తుకొచ్చారన్నమాట పిల్లలు. ఏం వ్రాసాడేమిటి?"

"పిల్లల్ని చూడాలనివుందట. తీసుకురమ్మని వ్రాసాడు" అంటూ కవరు మడిచి టేబులుమీద పెడుతుంటే "ఇంకేం వ్రాయలేదూ?" అడిగింది పార్వతమ్మ.

"ఇంకేం వ్రాస్తాడు?"

"బాగుంది. ఇంకేమయినా వ్రాసాడేమోనని అడిగానులెండి."

ఈ సారి శివరామయ్య సమాధాన మివ్వలేదు.

గోడవారగావున్న మంచం వాల్చుకుని, కిటికీగుండా బయిటికి చూస్తూ కూర్చున్నారు.

కాస్సేపు వూరుకుని పార్వతమ్మ అడిగింది.

"తీరా పిల్లల్ని తీసుకెళ్ళాక వాళ్ళని పంపనంటేనో?"

"ఉంచేసి వస్తాను."

"అక్కడెవరున్నారని వాళ్ళని చూడటానికి?—"

శివరామయ్య మౌనంగా వుండిపోయారు.

ఉండివుండి "ఏమండీ!" అని మెల్లగా పిలిచింది పార్వతమ్మ.

'ఏమి'టన్నట్లు చూసారాయన.

"అల్లుడు మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా వుంటాడంటారా?"

"ఎందుకుంటాడూ?" అన్నారు పరధ్యానంగా.

"ఆ వచ్చినావిడ పిల్లల్ని సరిగ్గా చూస్తుందంటారా?"

"అది నేనెలా చెప్పగలను?"

"ఊఁ" మూలిగింది పార్వతమ్మ.

"మనమ్మాయి బ్రతికున్నంతకాలం పువ్వుల్లో పెట్టి చూసుకున్నాడు పాపం. కాన్పుకి కూడా యిక్కడికి పంపలేదు. దానికే ఋణం లేకపోయింది."

కళ్ళు తుడుచుకుంది.

ఉన్నట్లుండి స్వరం తగ్గించి "పోనీ మన సరితని చేసుకోమని

అడిగితేనో?" అంది.

శివరామయ్య ఆశ్చర్యంగా భార్యవైపు చూసారు. "ఇది నీకు పుట్టిన బుద్ధేనా?" కోపంగా అన్నారు.

"కోపం దేనికి? ఆలోచించి చూడండి."

కరుణాకర్‌కి యేం తక్కువని? ఇంతకన్నా మంచి సంబంధం మనం మాత్రం తేగలమా? పైగా అక్కపిల్లలన్న అభిమానంలో వాళ్ళని కళ్ళల్లోపెట్టుకు చూసుకుంటుంది. మీరూ చూస్తూనేవున్నారుగా వాళ్ళని ఒక్కక్షణం విడిచిపెట్టదు. వాళ్లూ సరిత దగ్గర బాగా అలవాటయ్యారు. 'ఇంతకీ ఇది మన ఆలోచన మాత్రమే. ముందు అతనొప్పుకోవాలిగా."

"చాలు చాలు యిక అపు. ఒక పిల్లనిచ్చి బాధపడుతున్నాము. రెండో పిల్లని కూడా...." మాట పూర్తిచేయలేక ఆగిపోయారు.

"బాగుంది. దాని రాత అలా రాసిపెట్టుంటే ఎవరు తప్పించగలం? ఇంటినిండా అంతమంది నౌకర్లుండగా ఎప్పుడూ వంటగదిలోకి వెళ్ళనిది ఆ రోజు వంటమనిషి. రాకపోవడం....పిల్ల యేడవడం. వంటింట్లోకి వెళ్ళి, స్టవ్ అంటించడం....ఏమిటో భగవంతుడు అలా రాసిపెట్టాడు."

బొటబొట రాలుతున్న కన్నీళ్ళని కొంగుతో తుడుచుకుంది.

శివరామయ్య చివాల్న మంచంమీది నుంచి లేచి వొంకీపన్న ఉత్తరీయం బుజంమీద వేసుకుని వీధిలోకి నడిచారు.

"సరిత అభిప్రాయం ముందుగా తెలుసుకుంటే ఆ తర్వాత ఆయన్ని ఎలాగైనా వొప్పించవచ్చు" అనుకుంది పార్వతమ్మ.

వరండాలో స్తంభాని కానుకుని కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తోంది సరిత.

కొబ్బరిచెట్ల ఆకులు గాలికి కదిలినప్పుడల్లా ఆకుల సందుల నుండి నీరెండ వచ్చి సరిత ముఖంమీద పడుతోంది.

ఒడిలో ప్రశాంతంగా నిద్రపోతోంది పాప. రవిచంద్ర తుల కోట దగ్గర రైలుబండితో ఆడుకుంటున్నాడు.

పార్వతమ్మ మెల్లగా వచ్చి కూతురుప్రక్కన కూర్చుంది

ఆలోచనా సముద్రంలో మునిగివున్న సరిత, తల్లిని గమనించలేదు.

"సరితా."

ఉలిక్కిపడి చూసింది.

"బావ, పిల్లల్ని తీసుకురమ్మని ఉత్తరం వ్రాసాడు" అంది.

సరిత మాట్లాడలేదు.

"సావిత్రి లేనే లేదు. ఇక యీ పిల్లలు ఏమవుతారోనన్నదే నా దిగులు—"

ఒడిలోవున్న పాప తల నిమురుతూ వుండిపోయింది సరిత.

"నిన్నోమాట అడగనా తల్లీ!" సందేహిస్తూనే అంది.

తల్లి ఏమడగబోతుందో సరితకు తెలీకపోలేదు. అందుకు సమాధానం సిద్ధంగానే వుంచుకుంది.

"బావని చేసుకోడం నీకిష్టమేనా?" కూతురి మొహంలోకి చూస్తూ ప్రశ్నించింది.

"మీ యిష్టం" అనేసి పాపని పడుకోబెట్టటానికన్నట్లు లేచి లోపలికి వెళ్ళిపోయింది సరిత.

పార్వతమ్మ ఆశ్చర్యపోయింది. సరిత వెళ్ళినవైపే కళ్ళప్ప గించి చూస్తూ క్షణం వుండిపోయింది.

ఎంతో నచ్చజెప్పి ఒప్పించవలసి వుంటుంది అనుకున్న పార్వతమ్మ ఊహలకి భిన్నంగా అడగగానే ఒప్పేసుకుంది సరిత. అందుకే పార్వతమ్మ ఆశ్చర్యంనుండి వెంటనే తేరుకోలేకపోయింది.

తలక్రిందులుగా తపస్సు చేసినా యింతకన్నా మంచి సంబంధం తేగలమా? ఏకళ నుందో ఒప్పుకుంది. అదే పదివేలు." తేరుకున్నాక అనుకుంది.

ఒకటి కాదు. రెండు సమస్యలకు పరిష్కారమార్గం దొరికింది. ఆవిడ మనసు తేలికపడింది.

* * *

ఆ మరుసటిరోజు శనివారం.

పార్వతమ్మ రవిచంద్రని తీసుకుని గుడికి వెళ్ళింది.

వంటగది ప్రక్కనున్న వసారాలో కూర్చుని కూరగాయలు

కొస్తోంది సరిత.

అంతకు క్రితమే తలస్నానం చేసింది. తడివెంట్రుకలు వీపంతా పరుచుకుని నేలను తాకుతున్నాయి.

రాత్రినుండి కూతురుతో ఏకాంతంగా మాట్లాడాలనుకుంటు న్నారు శివరామయ్య. భార్య అటు వెళ్ళగానే లోపలికొచ్చారు.

పరధ్యానంగావున్న సరిత, ఎదురుగా వచ్చి నిలబడిన తండ్రిని గమనించలేదు.

"సరితా!" పిలిచారు.

"ఏం నాన్నా?" చటుక్కున తలెత్తి చూసింది.

ఉబ్బివున్న సరిత కళ్ళనూ, చెంపలమీదుగా కారిపోతున్న కన్నీళ్ళనూ చూసి, "యేడుస్తున్నావా తల్లీ!" కంగారుగా దగ్గర కొచ్చారు.

"లేదు నాన్నా! ఇప్పటివరకూ ఉల్లిపాయలు తరిగాను. అందుకని" పైటకొంగుతో గట్టిగా కళ్ళు తుడుచుకుంది. శివరామయ్య గోడవారగావున్న ఎత్తుపీట సరిత ప్రక్కగా జరుపుకుని కూర్చున్నారు.

"మీ అమ్మకేం తెలీదు తల్లీ! తొందరెక్కువ. జావని చేసుకో మని చెప్పి, నీ మనసు కష్టపెట్టుంటుంది." కూతురి తలమీద చేయి వేసి నిమురుతూ అన్నారు.

సరిత మాట్లాడలేదు.

కూరగాయలు తరుగుతోంది.

"చూడమ్మా! సావిత్రీ, నువ్వూ నాకు రెండు కళ్ళనుకున్నాను. భగవంతుడు ఓ కన్ను నిర్దాక్షిణ్యంగా పొడిచేశాడు. ఉన్న ఒక్క కన్నునీ స్వయంగా పొడుచుకుని గుడ్డివాడిని కాలేనమ్మా!"—

ఆయన కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి.

కాస్సేపు మాట్లాడలేకపోయినారు.

"మిమ్మల్నే నా సర్వస్వంగా పెంచుకున్నాను తల్లీ! మీరే నా ఆశాకిరణాలు. మీరే నా కంటి వెలుగు. మీరే నా ప్రాణం అనుకున్నాను. ఆ భగవంతునికేం అన్యాయం చేసానో నా ఒక రత్నాన్ని తీసుకుపోయాడు....అక్క పిల్లలకోసం నువ్వేం దిగులు పెట్టుకోకు.

కరుణాకర్ ఉత్తముడు. గుణవంతుడు. పిల్లల విషయంలో అతను అశ్రద్ధ చేయడనే నా నమ్మకం." కాస్సేపు ఆగి తిరిగి అన్నారు.

"రూపంలో, తెలివితేటల్లో నీకు నువ్వే సాటితల్లీ! నా సుగుణాల రాశివమ్మా నువ్వు. నీకు పెళ్ళి చేయలేకపోతానా? ఇల్లు అమ్మి——" తండ్రిమాట పూర్తికానీయలేదు సరిత.

"జానకి చేసుకోవడం నాకిష్టమే నాన్నా. ఈ విషయం నేనే ముందుగా మీతో చెప్పాలనుకున్నాను" అనేసి కూరముక్కలున్న గిన్నెలు తీసుకుని వంటగదిలోకి వెళ్ళిపోయింది.

ఆ మాటకి దిమ్మెరపోయి, స్థాణువులా వుండిపోయినారు శివరామయ్య.

కుతకుత ఉడుకుతూ పొంగుతున్న అన్నం గిన్నెలో గ్లాసెడు చన్నీళ్ళు పోసి గరిటతో తిప్పుతూ వుండిపోయింది సరిత.

"ఈ రోజు శనివారం కదూ, యెంత త్వరగా రావాలనుకున్నా తెమలలేదు" అనుకుంటూ లోపలికొచ్చిన పార్వతమ్మ యెత్తుపీట మీద శిలలా కూర్చున్న భర్తని చూచి "ఏమిటి, యింకా స్నానం చేయలేదూ" అన్నది.

చంకలోని రవిచంద్రని దింపి, "ఇదిగో సరితా! ప్రసాదం యిక్కడ పెడుతున్నాను. తీసుకో" అని భర్తవైపు తిరిగి "పదండి. నీళ్ళు తోడుతాను. శనివారంపూట యింతవరకూ స్నానం చేయకుండా కూర్చుంటారా?" గొణుక్కుంటూ చీర కుచ్చెళ్ళు బొడ్లో దోపుకుని భర్తకి నీళ్లు తోడటానికి వెళ్ళింది.

శివరామయ్య బరువుగా నిట్టూర్పు విడిచి భార్య వెనుకే స్నానాల గదివైపు దారితీసారు.

*   *   *

"మీకోసం యెవరో వచ్చారు" చెప్పాడు రంగన్న. క్రిందికి దిగి వచ్చాడు కరుణాకర్.

సోఫాలో కూర్చున్న వ్యక్తి లేచినిలబడి పలకరింపుగా నవ్వాడు.

కరుణాకర్ అతని కెదురుగా వున్న సోఫాలో కూర్చుంటూ 'చెప్పండి" అన్నాడు.

అతనూ కూచున్నాడు.

"నా పేరు పుల్లయ్య అంటారు. మీ నాన్నగారు నా గురించి చెప్పేవుంటారు. ఇదిగో మా అమ్మాయి ఫోటో. మీకు చూపించాలని" జేబులోంచి ఫోటోతీసి ముందుకు వంగి అందించబోయాడు.

చివ్వున లేచి నిలబడ్డాడు కరుణాకర్.

"మీరు యీ పనిమీద వస్తే వెంటనే వెళ్ళొచ్చు."

అతని మాటల్లోని కాఠిన్యానికి, కరకుదనానికీ తెల్లబోయి లేచి నిలుచున్నాడు పుల్లయ్య.

మరు క్షణంలోనే తేరుకుని "మీరు అనవసరంగా కోపం తెచ్చుకుంటున్నారు. నా గురించి కానీ, మా అమ్మాయిగురించి కానీ యెవరైనా గిట్టనివాళ్ళు చెప్పుంటారు మీకు. అటువంటివేం నమ్మకండి. ఏదో తల్లిలేని పిల్లకదా అని కాస్త గారాబంగా పెంచానంతే. హిఁ హి....హి మీ మొదటి భార్య ఫోటో చూసానుగా—ఇదుగో యీ ఫోటోకేసి ఒక్కసారి చూడండి. కాదనగలరేమో!"—

ఫోటో వున్న చేతిని కరుణాకర్ ముందుకు చాపాడు. తీక్షణంగా ఒక్క క్షణం అతనివైపు చూసి "రంగన్నా! ఇతన్ని ముందు బయటికి పంపు." అని వెంటనే అక్కడినుంచి వెళ్ళిపోయాడు కరుణాకర్.

నోరు, కళ్ళు అప్పగించేసి చలనంలేకుండా నిలబడి చూస్తున్న పుల్లయ్య భుజంమీద చేయి పడటంతో ఉలిక్కిపడి చూసాడు.

"బాబుగారు ఆఫీసుకి వెళ్ళడానికి యింకో నిముషంలో క్రిందికి దిగొస్తారు. ఇక్కడే నిలబడితే ప్రమాదం. ఆయన జేబులో పిస్తో లుంటుంది." స్వరం తగ్గించి చెప్పాడు రంగన్న.

ఇంతకు మునుపే కరుణాకర్ భీకర స్వరూపం చూచివున్న పుల్లయ్యకు, రంగన్న మాటలు వినగానే ముచ్చెమటలు పోసు కొచ్చాయి.

ఇంకేమీ మాట్లాడకుండా, కోపమంతా భుజంమీది కండువా దులపడంలో చూపించి, విసవిస నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

పది నిముషాల తరువాత క్రిందికొచ్చిన కరుణాకర్ రంగన్నని

పిలిచి "నాకోసం యెవరైనా వస్తే ముందుగా యేంపనిమీద వచ్చారో కనుక్కునిగానీ నన్ను పిలవకు." అని చెప్పి కారు తీసుకుని బయల్దేరాడు. కల్నల్ వర్మగారి యింటిముందు కారాపి లోపలికి వెళ్ళాడు.

ఎవరో అపరిచిత వ్యక్తులతో మాట్లాడుతోంది మిసెస్ వర్మ.

గుమ్మంలోనుంచే వెనక్కి తిరిగి పోబోయాడు.

బూట్ల చప్పుడికి తలెత్తి చూచిన మిసెస్ వర్మ "కరుణా! ఒక్క నిముషం కూర్చో. ఇప్పుడే వచ్చేస్తున్నా!" అంది.

గెస్టురూమ్‌లో 'వీక్లీ' తిరగేస్తూ కూర్చున్నాడు. అతని పొడవాటి బలమైన వ్రేళ్ళు పేజీలని తిప్పుతున్నాయి.

కళ్ళు చూస్తున్నాయి. కానీ, అతని మనసే అక్కడ లేనిది.

"వాళ్ళెవరో తెలుసా కరుణ్‌బాబూ!" అంటూ లోపలికొచ్చింది మిసెస్ వర్మ.

"మీరు చెప్పండే!" పుస్తకం మడిచి టేబులుమీద పడేసాడు.

"ఈ మధ్య చాలామంది వస్తున్నారు...." చెబుతూ కరుణాకర్ ప్రక్కనే వచ్చి కూర్చుంది.

"నేనే యేవో సమాధానాలు చెప్పి పంపేస్తున్నాను. వాళ్ళది విజయవాడట. బిజినెస్‌కోసం యిక్కడికొచ్చి స్థిరపడిపోయారు. ఒక్కర్తే కూతురు. నేను చెపితే వింటావని, యెవరో చెప్పిన మాట పట్టుకుని యిక్కడి కొచ్చారు."

అతను ఆలోచించుకోవడానికి వ్యవధినిచ్చే ఉద్దేశంతో, "ఇప్పుడే వస్తానుండు." అని లేచి లోపలికి వెళ్ళింది. రెండు నిముషాల్లో కాఫీ కప్పుతో తిరిగొచ్చింది.

కరుణాకర్ అక్కడలేదు.

కప్పు చేత్తో పట్టుకుని అలాగే నిలబడిపోయింది.

'ఎంత తప్పుచేసాను? సావిత్రి పోయి యింకా ఆర్నెల్లు కాలేదు. ఆమె జ్ఞాపకాల నుండి అతనింకా తేరుకోనైనా లేదు అప్పుడే తొందరపడి యీ విషయం కదిపాను. యేమనుకున్నాడో. మనసులో నన్నెంత అసహ్యించుకున్నాడో' తనని తాను తిట్టుకుంది..

చేతిలోని కప్పు టేబులుమీద పెట్టేసి గబగబా లోపలికొచ్చి

ఫోన్ చేసింది. కరుణాకర్ యింకా ఆఫీసుకి రాలేదని సమాధాన మొచ్చింది.

"అతను రాగానే నాకు ఫోన్ చెయ్యమని చెప్పు." అని రిసీవర్ పెట్టేసి, ఫోన్‌కాల్‌కోసం ఎదురుచూస్తూ కూర్చుండిపోయింది.

*    *    *

భార్య పోరగా, పోరగా మద్రాసు బయల్దేరి వెళ్ళారు శివరామయ్య.

ఆరోజు.

ఉదయానే గుమ్మంలో ప్రత్యక్ష మయిన భర్తను చూచి "అదేం అప్పుడే వచ్చేసారు!" అంటూ ఆశ్చర్యపోయింది పార్వతమ్మ.

ఆయన మాట్లాడకుండా లోపలికొచ్చారు. చేతి సంచి గోడ వారగా పెట్టి, వాలు కుర్చీలో చేరబడి కళ్ళు మూసుకున్నారు.

పార్వతమ్మ అతనికి దగ్గర్లో చాప పరుచుకుని కూర్చుంది.

ఆయన కళ్ళువిప్పి భార్యకేసి చూచారు.

ఆమె ఆదుర్దాగా చూస్తోంది.

శివరామయ్యకు నవ్వొచ్చింది.

నిన్న మొన్నటి వరకూ కూతురు పోయినందుకు కంటికి మంటికి యేకధారగా యేడ్చిన మనిషి—యీరోజు అల్లుడి ఆస్తి చేయి జారిపోకూడదు. కూతురి పెళ్ళి జరిగిపోవాలి. మనవలు బాగు పడాలి. ఎన్ని ఆలోచనలు? ఎంత స్వార్థం!

మనసు ఎంత చిత్రమయినది! అనుకున్నారు.

"ఇంతకీ అతనేమన్నాడు? మీరసలు సరితను చేసుకోమని అడిగారా?" భర్త ఎంతసేపటికీ మాట్లాడకపోయేసరికి పార్వతమ్మ అడిగింది.

"అడిగాను. ఒప్పుకున్నాడు." కుర్చీలోంచి లేచి పెరటిపైపు వెళ్ళిపోయారు.

'ఒప్పుకున్నందుకు సంతోషించడం పోయి, యీయనకీ విచారం దేనికో?' అర్థంకాక తనూ లేచి వెళ్ళింది పార్వతమ్మ.

ప్రక్క గదిలో రవిచంద్రకి తలదువ్వుతూ తండ్రి మాటలు విన్న సరిత తల దువ్వడం మర్చిపోయి, దువ్వెన చేతిలో పట్టుకుని, అలాగే నిలబడిపోయింది.

'బావ పెళ్ళికి వొప్పుకున్నాడా. మళ్ళీ పెళ్ళికి సిద్ధపడుతున్నాడా?! పాపం, అక్క యెంత వెర్రిది? బావని ఎంత పిచ్చిగా ప్రేమించింది? ఎంతగా ఆరాధించేది?

చచ్చిపోతూకూడా భర్తగురించి, పిల్లల గురించే ఆరాట పడింది. అవును. అక్క స్త్రీ.'

"పిన్నీ! అలా చూతున్నావేంటి?" చేతిలో దువ్వెన పట్టుకుని బొమ్మలా నిలుచునివున్న సరిత గడ్డం పట్టుకుని అడిగాడు రవిచంద్ర.

ఉలిక్కిపడి చూసిన సరిత గబగబా జాబు తలదువ్వి పంపేసింది.

"అక్కా! నీకిచ్చిన మాట నిలబెట్టుకోడానికి ఒక కామాంధుడికి నా జీవితం బలిచేస్తున్నాను" అనుకుంది మనసులోనే సరిత.

* * *

తిరుపతి దేవస్థానంలో అతి నిరాడంబరంగా పెళ్ళి జరిగిపోయింది. పెళ్ళి తతంగం జరుగుతున్నంతసేపూ యెవరి ముఖాలలోనూ కళాకాంతులు లేవు. కరుణాకర్ గంభీరంగా వుండిపోయాడు. సరిత సరేసరి. తోలుబొమ్మలా యెవరు యెటు కదిపితే అటే కదుల్తూ, యెవరేం చెబితే అదే చేస్తోంది.

పార్వతమ్మ పక్కకువెళ్ళి కళ్ళొత్తుకుంది.

మిసెస్ వర్మ సరిత రెండుచేతులూ పట్టుకుని "అతన్ని తిరిగి మనిషిని చేసే భారం నీదేనమ్మా!" అంది.

రెండు కార్లలో అందరూ తిరుగు ప్రయాణమై మద్రాసు వచ్చేసారు.

కరుణాకర్ పినతల్లి అన్నపూర్ణమ్మ నెల్లాళ్ళనుండీ యింటోనే వుండి అతని ఆలనా, పాలనా చూస్తోంది.

ఆవిడకే సరితనీ, పిల్లలనీ అప్పగించి మరునటి రోజు శివరామయ్య దంపతులు ప్రయాణమై వెళ్ళిపోయారు.

ఆ రోజు రాత్రి—

సావిత్రి నగలన్నీ సరిత ఒంటిమీద అలంకరించింది అన్నపూర్ణమ్మ. అరిచేయి వెడల్పు జరీవున్న తెల్లచీర సరిత చేతిలో పెడుతూ "ఇదైనా నువ్వు కట్టుకుంటావా? నన్నే కట్టమంటావా?" అంటూ హాస్యమాడింది.

తెల్లని బట్టల్లో మెరుస్తున్న రాళ్ళనగలతో దేవకన్యలా నిలుచున్న సరితమీద నుండి దృష్టి తిప్పుకోలేకపోయింది.

"యెంతమందో పిల్లనిస్తామని వచ్చినా వద్దన్నవాడు, నిన్నే యెందుకు చేసుకున్నాడో యిప్పుడర్థమయింది." అంది ముసిముసిగా నవ్వుతూ.

సరిత ముఖం తెల్లగా పాలిపోయింది.

చేతికి పాలగ్లాసు అందించింది. చేయిపట్టుకు నడిపించుకుంటూ మెట్లవరకూ తీసుకొచ్చి విడిచిపెట్టింది అన్నపూర్ణమ్మ.

పాలగ్లాసు చేత్తో పట్టుకుని, నిద్రలో నడుస్తున్న ఉన్మాదినిలా ఒకొక్క మెట్టే యెక్కసాగింది సరిత.

భూదేవికి తనమీద దయకలిగి భూకంపం రాకూడదూ! తనూ సీతలా భూమిలోకి దిగబడిపోతే ...ఉన్నట్టుండి భవనమంతా కూలిపోతే....అనుకుంది. మెట్లు ఎక్కుతున్నకొద్దీ గుండె దడ దన చెవులకే స్పష్టంగా వినిపిస్తోంది. ఒళ్ళంతా చెమటలు క్రమ్ముకున్నాయి. బలవంతాన తననుతాను అదుపులోకి తెచ్చుకుంటూ ఒకొక్క మెట్టే ఎక్కసాగింది.

గది ముందుకు వచ్చేసరికి ఎక్కడలేని నీరసం వచ్చేసింది. గొంతు తడారిపోయింది. కళ్ళు తిరుగుతున్నట్లు, వొళ్ళు తూలిపోతున్నట్లు అనుపించి గుమ్మాన్ని ఆసరాగా పట్టుకుని నిలబడిపోయింది.

కిటికీ దగ్గర నిలబడివున్న కరుణాకర్ పాదాల అలికిడికి వెనక్కి తిరిగిచూచి విభ్రాంతపోయాడు. ఒకచేత్తో గుమ్మం, రెండవ చేత్తో పాలగ్లాసు పట్టుకుని వయ్యారంగా తలొంచుకుని నిలబడి వుంది సరిత. అప్పటివరకూ యేవేవో ఆలోచనలతో సతమత మవుతున్న అతను ఒక్కసారిగా గంభీరంగా మారిపోయాడు.

సరిత ఒంటిమీద సావిత్రి నగలు.

ఆమె కట్టుకున్నది సావిత్రి చీర.

జుగుప్స, అసహ్యం, కోపం, బాధ, అసహనం మూకుమ్మడిగా చుట్టుముట్టాయతణ్ణి.

పిడికిళ్ళు బిగుసుకున్నాయి. కళ్ళు ఎర్రబడ్డాయి.

తనను తాను అదుపులోకి తెచ్చుకోవడానికని మొహం ప్రక్కకి తిప్పుకుని కళ్ళు మూసుకున్నాడు.

తలొంచుకుని నిలుచున్న సరిత ఆ సమయంలో అనుకుంది. 'అతను తన అందాన్ని ఆస్వాదిస్తున్నాడు. ఇంకో క్షణంలో తన రెక్క పుచ్చుకుని లోపలికి లాగి తలుపు మూస్తాడు.' ఈ ఆలోచనకి సరిత వొంట్లో రక్తమంతా ఒక్కసారిగా నీరుగా మారిపోయినట్లు శరీరమంతా చల్లబడిపోయింది. శవంలా బిగుసుకుపోయి పడిపోడానికి సిద్ధంగా వుంది.

అంతలో కరుణాకర్ మాటలు గంభీరంగా వినిపించాయి. "ఈ పెళ్ళితో నువ్వు, పిల్లలకి తల్లివయ్యావుగానీ—నాకు భార్యవి మాత్రం ఏనాటికీ కాలేవు. వెళ్ళిపో. ఇంకెప్పుడూ యీ ఛాయలకు రావడానికికూడా ప్రయత్నించకు."

సరిత నిర్ఘాంతపోయింది.

మూసివున్న తలుపులు చూశాకగానీ, తను విన్న మాటలు నిజమని నమ్మలేకపోయింది.

మరుక్షణం....ఏదో పెద్ద ప్రాణగండం గడిచి బయటపడినంత రిలీఫ్....అప్రయత్నంగానే గుండెల నిండుగా గాలి పీల్చుకుంది. గబగబా మెట్లు దిగిపోయింది.

అప్పటివరకూ మెట్లప్రక్కనున్న కిటికీ బయటినుంచి ఇదంతా గమనిస్తున్న రెండు కళ్ళు ప్రక్కకు తప్పుకున్నాయి. క్రిందికొచ్చేసి అన్నపూర్ణమ్మ గదివైపు చూసింది.

గది తలుపులు మూసి వున్నాయి.

'హమ్మయ్య!' అని గుండెలమీద చేయి వేసుకుని గదిలోకి పరుగెత్తి, తలుపులు మూసుకుంది.

తలలోని పూలు, ఆభరణాలు, చీర అన్నీ తీసివేసింది. తన

సాదా చీర కట్టుకొచ్చి, అమాయకంగా పడుకుని నిద్రపోతున్న పిల్లల మధ్య చోటు చేసుకుని పడుకుంది. ఇలా అనుకుంది: "అతని మాటలు నిజమని నమ్మాలా? నటనని అనుమానించాలా? నిజంగా పిల్లలకోసమే పెళ్ళి చేసుకున్నాడా?.... మరో ఉద్దేశం లేదా?....అంతా నటనే. వెంటనే బయటపడిపోడం యిష్టంలేక....ఏమో! భావి జీవితం గురించి బంగారు కలలుగన్న ఆనాటి సరిత....ఆకాశ సౌధాలు కట్టుకున్న ఆ సరిత ఈ రోజుతో చచ్చిపోయింది. ఈ కొత్త సరితకి భవిష్యత్తు లేదు. భూతకాలాన్ని విస్మరించాలి. వర్తమానంతో రాజీపడాలి. మిగిలిందీ తను చేయగలిగిందీ అంతే....

ఆలోచనలతో అలిసిపోయి నిద్రలోకి జారుకుంది.

*　　*　　*

మెలుకువ వచ్చి కళ్ళు విప్పి చూసింది సరిత.

తెల్లవారిపోయింది.

ప్రక్కన చూసుకుంది. పిల్లలులేరు. కంగారుగా గదిలోనుంచి బయటికొచ్చింది.

రవిచంద్ర డైనింగ్ టేబులుమీద కూర్చుని ప్లేటు ఒళ్ళో పెట్టుకుని తింటున్నాడు. పాపకి అన్నపూర్ణమ్మ తినిపిస్తోంది. ఆమె కంటబడటం యిష్టంలేక చప్పున గదిలోకి వెళ్ళిపోయింది సరిత.

స్నానంచేసి, గబగబా జడవేసుకుని వచ్చి "ఇలా యివ్వండి. నేను తినిపిస్తాను" అంది.

తలెత్తి చూచింది అన్నపూర్ణమ్మ.

"మెలుకువ రాలేదు" నేలచూపులు చూస్తూ తప్పు ఒప్పుకుంది సరిత.

ముసిముసిగా నవ్వుకుంది అన్నపూర్ణమ్మ.

"పిల్లలు లేచివస్తే ముఖాలుకడిగి, స్నానాలు చేయించాను. నిన్ను లేపడమెందుకులే అని నేనే వూరుకున్నాను. ఉండు ఫలహారం తెస్తాను."

లోపలికివెళ్ళి రెండు నిముషాల్లో పొగలు కక్కుతున్న ఉప్మా ప్లేటు తెచ్చి సరితముందు పెట్టింది. పాపకి పాలు పట్టిస్తూ అంది

"యేమిటో మా అక్కే బ్రతికుంటే ఆదారివేరు. అయినా వీళ్ళ వంశంలో అదేం శాపమోగానీ మా బావగారి తండ్రికీ రెండో సంబంధమేనట. మా బావగారికీ అంతే. పెళ్ళయిన నాలుగోయేటే పోయింది అక్క. అదే వారసత్వంగ వచ్చింది కరుణాకీని."

కాఫీగ్లాసు తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది కానీ, ఆమె ఒక్కసారి సరిత ముఖంకేసి చూచివుంటే తప్పక ఆశ్చర్యపోయి వుండేది.

ఆమెను లోపలికి వెళ్ళనిచ్చి ప్లేట్లోని ఉప్మాతీసి గోడవతలికి గిరాటువేసింది సరిత.

పిల్లల్ని తీసుకుని గదిలోకి వెళ్ళిపోయింది.

కరుణాకర్, మధ్యాహ్నం భోజనానికి వచ్చినప్పుడు వడ్డిస్తూ "ఈ సాయంత్రం బండికి వెళ్ళిపోతానబ్బాయ్." అన్నది అన్న పూర్ణమ్మ.

తింటున్నవాడల్లా ఆగి, తలెత్తి చూశాడు.

"మీ బాబాయ్, పిల్లలూ యెలా వున్నారోనని. నేను లేక లేకపోతే కట్టి ఆవు పాలివ్వదు. ఇంట్లో ఒక్కపనీ సవ్యంగా జరగదు. నువ్వు బొత్తిగా మనుషుల ధ్యాసలో లేకుండా తిరుగుతున్నావని మీ నాన్న చెబితే, ప్రాణం ఒప్పక వచ్చాను."

"సిటీ చూడండే వెళ్ళిపోతావా!" పెరుగు కలుపుకుంటూ అన్నాడు.

"బాబ్బాబు. ఇక అలాంటివేమీ పెట్టకు. అక్కడ పెద్ద సంసారం. వచ్చికూడా చానాళ్ళయింది. మళ్ళీ ఎప్పుడైనా వస్తాలే" అంది.

"సరే. సిద్ధంగా వుండు. నాలుగు గంటలకు వస్తాను." భోజనం ముగించి లేచాడు.

"మళ్ళీ నువ్వెందుకులే బాబూ? అవతల బోలెడు పనులుంటాయి. కారు పంపించు చాలు."

"భలేదానివే పిన్నీ! నువ్వన్నిపనులు పాడుచేసుకుని వచ్చి వుండగా లేంది, నీకోసం ఆమాత్రం రాకపోతేయెలా!" నవ్వు

కుంటూ వెళ్ళిపోయాడు.

సరితని భోజనానికి పిలిచింది అన్నపూర్ణమ్మ.

తింటుండగా "ఈ సాయంత్రం వెళ్ళిపోతున్నాను" అంది.

"వెళ్ళిపోతారా? నేనొక్కర్తినే వుండాలా?" అమాయకంగా అడుగుతున్న సరితను చూచి నవ్వింది అన్నపూర్ణమ్మ.

"వెళ్ళిపోక యిక్కడే వుండిపొమ్మంటావా పిల్లా? నాకూ అవతల ఇల్లూ, సంసారం లేదూ!" అంది. "నీకేం భయం. ఇంటి నిండా నౌకర్లు. పిల్లలు వుండనే వున్నారు. కరుణాని కాస్త పెంద లాడే రమ్మని చెబుతాలే!"

సరిత అన్నం కెలుకుతూ కూర్చుంది.

అన్నపూర్ణమ్మకి జాలేసింది. 'పాపం. చిన్నపిల్లకదూ! వొంట రిగా వుండాలంటే కొన్నాళ్ళు బెరుకుగానే వుంటుంది' అనుకుంది. కానీ పైకి తేలలేదు.

"పిల్లలగురించి వేరుగా చెప్పక్కర లేదనుకో. కరుణా పైకి గంభీరంగా కనుపించినా అతని మనసు వెన్నకన్న మృదువైనది. ఎప్పుడూ అతని మనసు నొప్పించకు. పనివాళ్ళని మరీ వొదిలేయక కాస్త కనిపెట్టివుండు" ఇలాటివేవో కొన్నిచెప్పి సామాన్లు సర్దుకో డానికి వెళ్ళింది అన్నపూర్ణమ్మ.

సరిగ్గా నాలుగు కాగానే కరుణాకర్ వచ్చాడు.

రంగన్న సామాన్లు తీసుకెళ్ళి కార్లో పెట్టాడు.

అన్నపూర్ణమ్మ సరిత దగ్గరకొచ్చి తాళంచెవు లిస్తూ "జాగర్త అమ్మాయ్. వెళ్ళొస్తాను" అంది.

ఒంచిన తల ఎత్తకుండానే 'సరే' నన్నట్లు తలూపింది సరిత.

"ఏదీ, యిలా చూడు" గడ్డం పుచ్చుకుని పైకిలేపింది.

సరిత తడికళ్ళు చూడగానే ఆమె హృదయం ద్రవించింది. ఆమె కళ్ళూ చెమ్మగిల్లాయి.

"ఛా! పిచ్చిపిల్లా! ధైర్యంగా వుండాలిగానీ" దగ్గరకు తీసుకుని కళ్ళు తుడిచింది.

రవిచంద్రని ఎత్తుకుని ముద్దు పెట్టుకుని దింపింది.

కారు హారన్ వినిపించి "వస్తానమ్మా!" అని అక్కడినుంచి వెళ్ళి కారెక్కి కూర్చుంది.

ఆమె సామాన్లతోపాటు రెండు పళ్ల బుట్టలూ, రెండు మిఠాయి పేకెట్లు ఆమె ప్రక్కన పెట్టించి, తను ఒక అట్టపెట్టె చేత్తో పట్టుకుని కంపార్టుమెంట్‌లోకి ఎక్కాడు కరుణాకర్.

"తీసుకో పిన్నీ!"

"కరుణా! నీకు మతిలేదురా! యివన్నీ ఎందుకూ!" అందుకుని అట్టపెట్టె మూతతీసి చూచింది. ఖరీదైన పట్టుచీర, రెండు జాకెట్ బట్టలూ వున్నాయి.

"అమ్మ తరువాత అమ్మ అంతటిదానివి. అలా అనకు పిన్నీ!"

అతని మాటల్లోని ఆప్యాయతకి మారుపలకలేక పేకెట్ ప్రక్కన పెట్టుకుంది.

గార్డు పచ్చజండా వూపాడు.

కరుణాకర్ కిటికీ దగ్గరకొచ్చి నిలబడ్డాడు.

రైలు కదిలింది.

"కరుణా! ఒక్క విషయం. సరిత చిన్నపిల్ల. ఒంటరిగా వుండాలంటే భయపడుతోంది. కాస్త పెందలాడే యింటికి వెళ్లిపోతూ వుండు."

ఆమె చెపుతూండగానే రైలు వేగాన్ని పుంజుకుంది.

కారు వేగంకన్నా కరుణాకర్ ఆలోచనలు మరింత వేగంగా సాగిపోతున్నాయి.

'బహుశ ఆ అమ్మాయే, పిన్నిని అలా చెప్పమని చెప్పి వుంటుంది. రాత్రి చూసాడుగా సావిత్రి నగలన్నీ దిగేసుకుని ఎంత ధైర్యంగా వచ్చి నిలబడిందో' ఇంటివైపు పోతున్న కారును గేరు మార్చి క్లబ్బువైపుకు మళ్ళించాడు.

కరుణాకర్ క్లబ్బులో అడుగుపెడితే చాలు

'అడుగో టైగర్ వస్తున్నాడు' అంటూ అందరూ గప్‌చుప్ అయిపోతారు. ఠీవిగా, దర్పంగా అతను నడిచివస్తుంటే స్నేహ

పూర్వకంగా నవ్వుతూ విష్ చేస్తారు. ఇప్పుడు వాళ్ళు అలా విష్ చేస్తున్నా, నవ్వుతూ చూసినా, ముళ్ళు గుచ్చుకుంటున్నట్లు బాధ పడుతున్నాడు కరుణాకర్.

ఎవరైనా మెల్లగా మాట్లాడుకుంటుంటే 'మరదల్నే చేసుకున్నాడు' అని చెప్పుకుంటున్నారని అనుమానం.

ఎక్కువ సేపు అక్కడ కూర్చోలేక లేచి బయిటికి వచ్చేసాడు. బీచ్‌లో ఎవరూ లేనిచోట కూర్చుని సావిత్రితో గడిపిన రోజులు గుర్తు చేసుకుంటూ కాలాన్నే మర్చిపోయాడు.

"సార్! యింకా యిక్కడే కూర్చున్నారే!" పోలీసు కానిస్టేబుల్ దగ్గరగా వచ్చి అడిగాడు.

అతని ఆలోచనలకి అంతరాయం కలిగింది. లేచి వాచీ చూసుకున్నాడు. పదకొండున్నర దాటింది. సోఫాలో కూర్చుని ఒడిలో మేగజైన్ పెట్టుకుని కునికిపాట్లు పడుతోంది సరిత.

బూట్ల చప్పుడికి తుళ్ళిపడి లేచింది. అప్పటికే కరుణాకర్ గదిలో లైటు వెలుగుతోంది. లేచి భోజనాల గదివైపు నడిచింది.

పది నిముషాలు గడిచినా అతని జాడలేదు. మెట్లవరకూ వచ్చి చూసింది.

తలుపులు మూసివున్నాయి. గదిలో వెలుతురు లేదు. అలికిడి లేదు.

గోడ గడియారం వంక చూసింది.

పన్నెండు కావడానికి ఒక్క నిముషం వుంది. టేబులు మీదివన్నీ తీసి సర్దేసింది.

గ్లాసుడు నీళ్ళు త్రాగి వెళ్ళి, గది తలుపులు మూసుకుంది.

* * *

తెల తెలవారుతుండగా నిద్రలేచింది సరిత. పిల్లల్ని లేపి వాళ్ళ పనులు స్వయంగా చూసింది. వాళ్ళకి నీట్‌గా డ్రస్ వేసి ఆడుకోమని వదిలేసరికి ఏడున్నర గంట లయింది.

"కరుణాకర్ ఎనిమిది గంటలకు క్రిందికి వస్తాడు. అప్పటికి ఫలహారం సిద్ధంగా వుంచాలి. ఆ తరువాత అతను ఆఫీసు రూమ్‌లో

ఓ గంట గడిపి వెళ్ళిపోతాడు. ప్రతీ పనిలోనూ పంక్చువాలిటీ మేన్ టేన్ చేసే మనిషి.” అన్నపూర్ణమ్మ మాటలు మనసులో పెట్టుకుని ఎనిమిది కాగానే డైనింగ్ టేబులు సర్ది సిద్ధంగా వుంచింది.

క్రిందికి దిగివచ్చిన కరుణాకర్ తిన్నగా ఆఫీస్ రూమ్‌లోకి వెళ్ళాడు.

గోడ గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

పోర్టికోలో సిద్ధంగావున్న కారు స్టార్ట్ అయిన చప్పుడు విని గబగబా వచ్చి చూసింది సరిత.

కారు గేటుదాటి పోయింది.

12 గంటలకి పిల్లలకి అన్నాలు తినిపించి పడుకోపెట్టింది. ఒంటిగంటకు అతను వస్తాడని ఎదురుచూస్తూ కూర్చుంది. రెండు గంటలు దాటినా అతని జాడ లేదు. రాత్రి రావడమే తలుపులు మూసుకున్నాడు.

ఈ విధంగా నాలుగు రోజులు గడిచే సరికి సరిత హృదయం కలత పడింది. ఇంట్లో నౌకర్లు మాత్రం యేమనుకుంటారు? అతని ఆంతర్యమేమిటో బోధపడలేదు.

ఏం చేయాలో తోచలేదు. ఆలోచిస్తూ కూర్చుంది. గడియారం పన్నెండు గంటలు చూపిస్తోంది.

“అతను భోజనం చేసేలా చూడటం తన విధి. లేకపోతే అక్క ఆత్మకి శాంతి వుండదు.” నిర్ణయాని కొచ్చి ధైర్యంగా లేచి వెళ్ళి నంబర్ డయిల్ చేసింది.

“హలో!” అవతలనుండి కరుణాకర్ గొంతు మంద్ర గంభీరంగా వినిపించింది.

“..........”

“ఎవరు మాట్లాడుతుంట? పలకరేం?”

“నేను........నేను.”

“నే నంటే??”

“స....సరితని.”

టక్కున ఫోను పెట్టేసిన చప్పుడు వినిపించి “హలో!....

హలో!" గట్టిగా పిలిచింది.

అవతలి నుంచి రెస్పాన్సు లేదు.

సరిత ముఖం ఎరుపెక్కింది.

ఆరోజు రాత్రి అతనన్న మాటలు గుర్తుకొచ్చాయి.

"ఈ పెళ్ళితో నువ్వు పిల్లలకి తల్లివయ్యావు గానీ...."

ఆలోచిస్తూ బొమ్మలా నిలబడిపోయింది సరిత.

* * *

మేడదిగి వస్తున్న తండ్రిని, మెట్లచాటుగా దాక్కుని తొంగి, తొంగి చూడసాగాడు రవిచంద్ర.

అది గమనించిన కరుణాకర్ క్రిందికొచ్చి బాబుని ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు.

"అబ్బా!" అంటూ చెంప తడుముకున్నాడు రవి.

"నొప్పి పెట్టిందా?"

'లేదు' అన్నట్లు తల అడ్డంగా వూపాడు.

"మరి?"

తండ్రి మీసాల వైపు చూపించాడు రవి.

గట్టిగా నవ్వాడు కరుణాకర్.

అక్కడే యేదో పని చేసుకుంటున్న రంగన్న చేతిలో పని ఆపేసి చూస్తూ నిలబడిపోయాడు.

ఇన్నాళ్ళ తరువాత తన యజమాని మనస్ఫూర్తిగా నవ్వడం చూచిన అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

"డాడీ!ఆకలి!"

వెంటనే కరుణాకర్ బొమ్మ వెంట్రుకలు ముడి పడ్డాయి.

క్షణం మనిషి అదోలా ఐపోయాడు.

బాబు నెత్తుకుని డైనింగ్ హాలువైపు నడిచాడు.

టేబులుమీద అన్నీ అమర్చివున్నాయి.

బాబుని వొళ్ళో కూర్చోపెట్టుకుని, స్పూనుతో ఉప్మాతీసి రవి నోట్లో పెట్టాడు.

"మరి నువ్వో!"

"నేనూ తింటాను."

"నేనే తింటాను డాడీ! నువ్వు బట్టల మీద పడేస్తున్నావు." కరుణాకర్ వొడిలోనుంచి దిగి ప్రక్క కుర్చీలో కూర్చుని తిన సాగాడు రవి.

తింటూ మధ్యలో తలెత్తి చూచాడు రవి.

"మరి నువ్వు తినడం లేదే?" తండ్రి చేయి పట్టుకుని కుదుపుతూ అడిగాడు.

"తింటున్నాగా!" ప్లేటు ముందుకు లాక్కున్నాడు కరుణాకర్. నీట్‌గా, బొమ్మలా వున్న పాప తప్పటడుగులు వేసు కుంటూ అక్కడి కొచ్చింది.

అతను చేతులు చాపాడు.

కిలకిల నవ్వుకుంటూ వచ్చి తండ్రి కాళ్ళని చుట్టేసింది పాప. పాపని ఎత్తుకుని వొడిలో కూర్చో పెట్టుకున్నాడు. స్పూనుతో జీడి పప్పు తీసి నోటికి అందించ బోయాడు.

"ఒద్దు"న్నట్లు తల అడ్డంగా వూపింది.

టిఫిన్ తినడం పూర్తయ్యాక రవికి పాలగ్లాసు అందించాడు.

"మరి నువ్వో."

"నేనూ" అతనో గ్లాసు అందుకున్నాడు.

పాపని ఎత్తుకుని కారు వరకూ వచ్చి అక్కడ రంగన్న చేతికి పాపనందించి కార్లో యెక్కబోయాడు.

రవి తనూ కార్లో వస్తానని మారాం చేసాడు.

"నువ్వు రాకూడదు బాబూ!" బుజ్జగించాడు.

"ఎందుకూ?"

"ఆఫీసుకి చిన్నపిల్లలు రాకూడదు."

"ఆఫీసుకి....చిన్న పిల్లలొస్తే....కోప్పడతారా?"

"ఔను."

"ఐతే రానులే." దూరంగా నిలబడి తండ్రికి టాటా చెప్పాడు రవిచంద్ర.

కార్లో కూర్చుని తలుపు మూసుకున్నాడు కరుణాకర్.

మధ్యాహ్నం పన్నెండు గంటలకి నంబర్ డయిల్‌చేసి ఫోను రవి కందించింది సరిత.

పిన్ని నేర్పిన పాఠం వప్పగించేడు రవిచంద్ర.

ఫోను పెట్టేసి, రవిచంద్ర చెంపలమీద ముద్దుపెట్టుకుంది సరిత. సరిగ్గా ఒంటిగంటకు ఇంటికొచ్చాడు కరుణాకర్.

పిల్లల కబుర్లు వింటూ, వాళ్ళకి కబుర్లు చెపుతూ భోజనం ముగించి వెళ్ళిపోయాడు.

రాత్రి తొమ్మిది గంటలకు ఇంటికి రాగానే "రంగన్నా! రవిబాబు ఎక్కడ?" అని అడిగాడు.

"ఇప్పటివరకూ మీ కోసం చూసిచూసి పడుకున్నారు బాబూ!"

మాట్లాడకుండా మేడపైకి వెళ్ళిపోయాడు కరుణాకర్.

ఆ రోజు రాత్రి నిశ్చింతగా నిద్రపోయింది సరిత.

* * *

క్రమేణా రోజులు గడుస్తున్నాయి.

కరుణాకర్ ఆఫీసు పనిమీద ఢిల్లీవెళ్ళి రెండు రోజులయింది.

పిల్లలబట్టలు ఇస్త్రీ చేస్తూ యధాలాపంగా కేలండరువైపు చూసింది సరిత.

రేపు నవంబరు పధ్నాలుగు. బాబు పుట్టినరోజు అన్న విషయం చటుక్కున గుర్తువచ్చింది.

క్రిందటేడు బాబు పుట్టినరోజుకు రమ్మని అక్క ఉత్తరం వ్రాస్తే వెళ్ళలేక ప్రజంటేషను, గ్రీటింగ్సు పంపింది. ఏడాదిలో ఎంత మార్పు? అక్క వుంటే బాబు పుట్టినరోజు ఎంత ఘనంగా చేసుకునేదో! అనుకుంది.

ఆ సాయంత్రం రంగన్నని తోడు తీసుకెళ్ళి బాబుకి, పాపకి బట్టలు, కావలసిన వస్తువులూ కొని తెచ్చింది.

మరుసటి రోజు ఉదయమే బాబుకి తలంటి స్నానం చేయించి కొత్తబట్టలు తొడిగింది. ఇంట్లో పిండివంటలు చేయించింది. 'చుట్టుపక్కల పిల్లలని బాబు పుట్టిన రోజని చెప్పి పిలువు' అని రంగన్నని పంపింది.

సాయంత్రం నాలుగుగంటలు కాగానే బాబుకి మరోజత క్రొత్తబట్టలు తొడిగి తయారుచేసింది.

ఒకొక్కళ్ళే పిల్లలంతా వచ్చారు.

రవిచంద్రచేత కాన్‌డిల్స్ ఊదించి కేక్ కట్ చేయించింది సరిత.

పిల్లలంతా 'హేపీ బర్త్‌డే టు యూ!' అంటూ విష్‌చేశారు.

అందరిలోకీ కాస్త పెద్దపిల్ల ముందుకొచ్చి "ఆంటీ! క్రిందటేడు రవివాళ్ళ మమ్మీ పాట పాడారు. ఇప్పుడు మీరు పాడాలి" అంది.

ఆపిల్ల అలా అనగానే పిల్లలంతా చుట్టూ మూగి "ఆంటీ పాడాలి" అంటూ గొడవచేయసాగారు.

"నాకు రావమ్మా! మీరు పాడితే నే వింటాను" అని సరిత ఎంత చెప్పినా వినిపించుకోకుండా "మేం నమ్మం. మీకు పాటలొచ్చు. పాడవలసిందే" అంటూ మొండి పట్టుపట్టారు.

సరితకి తప్పలేదు.

అప్పటివరకూ కాకిగోలగా అల్లరిచేస్తున్న పిల్లల నోటికి ఒక్కన తాళం పడ్డట్టు అల్లరి ఆగిపోయింది.

తీయతీయగా, కమ్మకమ్మగా సరిత పాడుతూంటే తన్మయులై తలలూపుకుంటూ కన్నార్పకుండా ఆమెనే చూస్తూ కూర్చుండిపోయారు పిల్లలు.

ఆ సమయంలో కారువచ్చి పోర్టికోలో ఆగినట్లు యెవరూ గమనించలేదు.

కారుదిగి వరండా మెట్లు ఎక్కుతూ శ్రావ్యమైన పాట వినిపించి ఆగిపోయాడు కరుణాకర్.

కిటికీవరకూ వచ్చి కర్టన్ తొలగించి చూసి ఆశ్చర్యపోయాడు 'ఈ రోజు బాబు పుట్టినరోజు కదూ!" ఒక్క క్షణంలో అతని ఆలోచనలు సంవత్సరం వెనక్కి పరుగుతీశాయి.

'సరిత స్థానంతో సావిత్రి. ఆమెప్రక్కన తను. ఎంత ఆనందంగా గడిచిందా రోజు!'

బరువుగా నిట్టూర్పు విడిచి కర్టన్ వదిలేసాడు.

వెళ్ళి లాన్‌లో కూర్చున్నాడు.

పాట అయిపోయింది. "ఆంటీ యింకొక్క పాట పాడండి" అంటూ గోలచేసారు పిల్లలు.

"ఇక పొద్దు పోయింది. మీరు యిళ్ళకి వెళ్ళాలిగా!" అంటూ అందరికీ కడుపునిండా ఫలహారాలు పెట్టింది సరిత.

పిల్లలంతా వెళ్ళిపోయాక బాబునెత్తుకుని అక్కగారి ఫోటో కెదురుగా నిలబడింది.

"ఈ రోజు బాబు పుట్టినరోజక్కా! నీ కొడుకుని నిండు మనసుతో దీవించు" అంటూండగా సరిత కళ్ళల్లో నీరు చిప్పిల్లింది. రవిచంద్ర తల్లి ఫోటోని కళ్ళకద్దుకుని నమస్కరించాడు.

లోపలికొస్తూ యీ దృశ్యం చూచాడు కరుణాకర్.

తండ్రిని చూసి, సరిత చేతుల్లోంచి జారి ఎదురు పరుగెత్తాడు రవిచంద్ర.

సరిత లోపలికి వెళ్ళిపోయింది.

కరుణాకర్ చేతులుచాపి కొడుకునెత్తుకుని ఆర్తిగా గుండెల కదుముకున్నాడు.

"డాడీ! యీ రోజు నా పుత్తినరోజు!"

"అవును బాబూ!" కరుణాకర్ మనసు ఆర్ద్రమయింది. కళ్లు చెమ్మగిల్లాయి.

రవిచంద్రని నుదిటిమీద ముద్దుపెట్టుకుని దింపాడు.

అక్కడ నిలువలేనట్లు గబగబా మెట్లెక్కి పైకి వెళ్ళిపోయాడు.

* * *

పిల్లల్ని పడుకోబెట్టి తన గదిలో కూర్చుని తండ్రికీ, అన్నపూర్ణమ్మకి ఉత్తరాలు వ్రాసింది సరిత. ఆ తరువాత యేమీ తోచక తోటవైపు నడిచింది.

పోషణలేక వాడివున్న చెట్లను చూసి సరిత ప్రాణం వుసూరుమంది. దగ్గర్లో కనుపించిన పలుగు తీసుకుని చెట్లకు బోదెలు తవ్వుతూ కూర్చుంది.

అంతలో అటుగా వచ్చిన రంగన్న సరితను చూసి "మేమింత

మంది వుండగా ఆ పని మీ కెందుకమ్మా! లేవండి" అన్నాడు.

"అందరూవుండే చెట్లనిలాఎండబెట్టారుగా!"తలెత్తిచూసింది.

"ఆఁ యేదో అశ్రద్ధ అయిపోయిందమ్మా! సావిత్రమ్మవున్న రోజుల్లో మాకొక్క క్షణం తీరికుండేదనుకున్నారా? సాయంత్ర మయితే చాలు అందరూ యీ తోటలోనే చేరేవాళ్లు. ఇక్కడే కాఫీ ఫలహారాలు. ఒక్కొక్కప్పుడు రాత్రి భోజనాలు కూడా యిక్కడే జరిగేవి. అయ్యగారికి చెట్లంటే మాప్రాణం. ఇంటికొచ్చిన వాళ్ళు తోటని మెచ్చుకోకుండా పొయ్యేవాళ్ళే కాదంటే నమ్మండి. అటు వంటిది బాబుగారు యీ ప్రక్కకే రావడం మానుకున్నారు. దాంతో మాకూ శ్రద్ధపోయింది."

సరిత కళ్ళకి ఒక్కక్షణం తోటంతా శోభాయమానంగా, కనులపండువుగా కనిపించింది. అందులో అక్క....బావ, పిల్లలు ఆ దృశ్యాన్ని ఊహించుకుంది.

చిన్నగా నిట్టూర్పు విడిచింది.

సరిత మొహంకేసే చూస్తూ నిలబడ్డ రంగన్న మరోలా ఊహించుకున్నాడు.

"మీరు బాధపడకండి అమ్మగారూ! ఇక తోట విషయం నాకొదిలేయండి. చూసుకోండి నాలుగు రోజుల్లో యీ చెట్లకి పూలు, కాయలు, పిందెలు కాయించేస్తాను" హుషారుగా అన్నాడు.

సరిత అతనివైపు చూసి నవ్వింది.

"ఆ పూలకన్నా నాజూకమ్మా మీ చేతులు. చూడండి, ఎర్రగా ఎలా కందిపోయాయో!" చొరవగా సరిత చేతిలోని పలుగు తీసుకున్నాడు.

చేతులు కడుక్కొచ్చి పారిజాతం చెట్టుచుట్టూ కట్టిన తిన్నెమీద కూర్చుంది సరిత.

సరితకి కాస్త దగ్గర్లో నేలమీద కూర్చున్నాడు రంగన్న.

"మీగురించి సావిత్రమ్మ యెప్పుడూ చెపుతుండేవారండి." అన్నాడు.

"ఏమని?"

"మీరు బాగా పాడతారనీ, పెద్ద సదువు సదివారనీ, సానా మంచోళ్ళనీ యింకా...." గుర్తురాక బుర్ర గోక్కున్నాడు.

సరిత నవ్వింది.

అంతలో, లోపల్నించి పాప ఏడుపు వినిపించి లేచి వెళ్ళింది.

ఆ రోజు మొదలు తీరిక వేళల్లో సరిత తోటకి రావడం ప్రారంభించింది. రంగన్నకి సలహాలిస్తూ....తనూ అతనికి సాయం చేస్తూ....అలా పది రోజులు కష్టపడి ఇద్దరూ కలిసి ఒక తీరుకు తెచ్చారు తోటని.

* * *

రోజులు గడుస్తున్నాయి.

కరుణాకర్‌లో యేవిధమైన మార్పులేదు. అతనిలో మార్పు తీసుకురావాలి. అతన్ని ఆకర్షించాలన్న కోరిక సరితకీలేదు. బయటి ప్రపంచానికి వాళ్ళిద్దరూ భార్యాభర్తలు. కానీ, యింట్లో వాళ్ళ ప్రవర్తన చిత్రంగా వుంటుంది.

అతని కంటపడితే ఏక్షణాన అతనికి యేంబుద్ధి పుడుతుందో నన్న భయంతో తప్పించుకు తిరుగుతుంది సరిత.

పొరపాటున సరిత కంటపడినా కన్నెత్తయినా చూడడు కరుణాకర్. యేకాన్త తీరికచిక్కినా సావిత్రి ఫోటోలు చూసుకుంటూ, ఆమెతో గడిపిన మధురక్షణాలు గుర్తుచేసుకుంటూ వుండిపోతాడు.

ఇంట్లో రవిచంద్రుని అల్లరి మితిమీరిపోయింది. కోప్పడితే యేడుస్తాడు. వీడ్ని దారిలో పెట్టాలంటే స్కూలొక్కటే మార్గం అన్న నిర్ణయానికొచ్చి, వాడ్ని స్కూల్లో చేర్పించింది సరిత.

రవిచంద్రుడు స్కూలుకి వెళ్ళక పూర్వం అయితే వాడితోటే సగం పొద్దు గడిచిపోయేది సరితకి.

ఇప్పుడు అంతా తీరికే. పాప ఎక్కువ సమయం నిద్ర పోతుంది. లేచినా అల్లరిచేయదు. కాస్సేపు తోటలో, కాస్సేపు చదువుతూ, వ్రాసుకుంటూ కూర్చున్నా యింకా సమయం మిగిలి పోతూనేవుంది సరితకి.

ఒక్కక్షణం తీరిగ్గా కూర్చుంటే యేవేవో ఆలోచనలు జోరీగల్లా చుట్టుముట్టి మనఃస్థిమితం లేకుండా చేస్తాయి. అందుకే ఎప్పుడూ ఏదో వో పని కల్పించుకుంటూ వుంటుంది.

ఆ రోజు—

మధ్యాహ్నం రెండుగంటల సమయంలో పాపని పడుకోబెట్టి స్వెటర్ అల్లుతూ ముందు హాలులో కూర్చుంది సరిత.

పదిహేను, పదహారేళ్ళ ఓ అమ్మాయి కర్టన్ తొలిగించుకుని చొరవగా వచ్చి సరిత ప్రక్కనే కూర్చుంటూ "మాది, మీ యెదురిల్లే అక్కా! నాపేరు నగ్రిత" అన్నది.

ఆ పిల్ల ఎందుకొచ్చిందో తెలీక 'అలాగా!' అని వూరుకుంది సరిత.

"నేను టెన్తు తప్పాను. ఇంట్లోవుంటే యేం తోచడంలేదు. మీ పాపకి వేస్తున్న గౌనులూ, అవీ చూశాక మీదగ్గర ఎంబ్రాయిడరీ నేర్చుకోవాలనిపించింది. మీరేం అనుకోనంటే మధ్యాహ్నం వేళల్లో వస్తాను" అన్నది.

ఏంతోచక కొట్టుకుంటున్న సరిత వెంటనే సరేనని ఒప్పుకుంది.

ఆ అమ్మాయి రెండు రోజులొచ్చి, మూడో రోజు మరో ముగ్గురు తనీడు పిల్లలను వెంటపెట్టుకొచ్చింది. "అక్కా! వీళ్ళకి నిట్టింగ్ నేర్చుకోవాలని వుందట" అంటూ.

మధ్యాహ్నపు వేళలు ఆ పిల్లలతో గడిచిపోతున్నది సరితకి.

*　　　　*　　　　*

పాపని వొడిలో కూర్చోపెట్టుకుని తల దువ్వుతూ కూర్చుంది సరిత. ఫోను గణగణ మ్రోగడంతో పాపని వొళ్ళోనుంచి లేపి ప్రక్కన కూర్చోబెట్టి, వెళ్లి ఫోన్ అందుకుంది.

"హలో! నేను....మిసెస్ వర్మని."

"నమస్కారమండీ!"

"చూడు సరితా! యీ రోజు మా వంశీ పుట్టినరోజు. కరుణాకర్‌కి చెప్పాను నిన్నూ, పిల్లల్నీ తీసుకురమ్మని. ఎప్పుడు పిలిచినా

యేవేవో సాకుచెప్పి తప్పించుకుంటున్నావు. ఈసారి అలా కుదరదు. తప్పకుండా రావాలి. ఏదీ వస్తానని ప్రామిస్ చెయ్యి."

"అలాగేనండీ!"

"గుడ్ గరల్. మరి వుంటాను."

సాయంత్రం నాలుగు గంటలు దాటింది.

"సరితా! సరితా!" పిలుచుకుంటూ లోపలికొచ్చింది మిసెస్ వర్మ. అమ్మాయిగారు గదిలో వున్నారని చెప్పాడు రంగన్న.

హడావిడిగా లోపలికివెళ్లి మంచంమీద కూర్చున్న సరితను చూచి "ఇంకా తయారవలేదూ! మీరు రాలేదని వర్మగారు నన్ను పంపారు"....అంతలోనే సరిత కాలుకున్న బేండేజిని చూచింది. "అరే! నే చూడ్లేదు. ఈ కట్టేమిటి!"

"కత్తిపీటమీద కాలుపడింది___" చీర కుచ్చెళ్ళు కొద్దిగా ఎత్తి పట్టుకుని కాలు చూచుకుంటూ జవాబిచ్చింది సరిత.

"వంటింట్లో నీకేంపని? కత్తిపీట యినపది కాదుకదా? సెప్టిక్ కాకుండా యింజక్షన్ చేయించుకున్నావా?"

"ఊఁ"

"ఎంతపని జరిగింది" నొచ్చుకుంది మిసెస్ వర్మ.

"ఈ కట్టుతో కుంటుకుంటూ రావాలంటే....సిగ్గుగా ఉంటుంది. క్షమించండి."

"భలేదానివే! నువ్వు రాలేదని నేనుమాత్రం యెలా అనుకుంటాను? ముందు కాలు జాగ్రత్త. నాలుగు రోజులు కాలు కదపకుండా రెస్టుతీసుకో." అంటూనే లేచి మేడమీదికి వెళ్ళింది.

కాళ్ళు చాపుకుని, కుర్చీకి జారబడి, ఆలోచిస్తూ కూర్చున్న కరుణాకర్ మిసెస్ వర్మని చూచి సర్దుకుని సరిగా కూర్చున్నాడు.

"బాగుంది వరస. అవతల సరితేమో కాలుతెగి కట్టు కట్టుకు కూర్చుని రాలేనంది. నాలుగు గంటలకు వస్తానన్న నువ్వేమో అయిదయినా యింకా యిక్కడే వున్నావు___" మెట్లెక్కి వచ్చిన అలసటతో అక్కడేవున్న కుర్చీలో చతికిలబడింది.

"కరుణ్ బాబూ! యింకా అలా చూస్తావేం? లేచి తయారవు."

అని అటని సమాధానం కోసం ఎదురు చూడకుండా లేచి చకచక క్రిందికిదిగి వెళ్ళిపోయింది.

అప్పటివరకూ ఆలోచిస్తూ కూర్చున్న కరుణాకర్ 'సరిత రావడంలేదు' అని వినగానే వెంటనే తయారయి వచ్చాడు.

రవిచంద్ర నీట్‌గా తయారయి మిసెస్ వర్మ వాళ్ళో కూర్చుని కబుర్లు చెబుతున్నాడు.

కరుణాకర్ దిగిరావడం చూచి, సరిత గదిలోకివెళ్ళి, వెడుతున్నానని చెప్పివచ్చి కార్లో కూర్చుంది మిసెస్ వర్మ.

ఆహ్వానితులందరూ జంటలు జంటలుగా వస్తున్నారు.

కల్నల్‌వర్మ హడావిడిగా అటూ యిటూ తిరుగుతూ అధితులను ఆహ్వానిస్తూ నవ్వుతూ మాట్లాడుతున్నారు.

ఎవరో ప్రజంటేషన్ తెచ్చారు.

వర్మ నవ్వుతూ "మీరు వాడికోసం తెచ్చారు బాగానేవుంది, కానీ, వాడెక్కడున్నాడో నాకు తెలీదే. అయినా ప్రయత్నించి మీ 'కానుక' వాడికి అందేలా చూస్తాను" అన్నారు.

అతని ప్రక్కనే నిలబడివున్న మిసెస్ వర్మ అదోలా ఐపోడం చూచి ఆమెను అక్కడినుంచి దూరంగా తీసుకుపోయాడు కరుణాకర్.

ఎనిమిది గంటలకు బఫే డిన్నర్ మొదలయింది.

ఎవరో ప్లేటు నింపి కరుణాకర్ చేతి కిచ్చారు.

ప్లేటు పుచ్చుకుని చెట్టు ప్రక్కగా వచ్చి నిలబడ్డాడు. క్రింద ఉేడు బర్త్‌డేకి సావిత్రితో కలిపి రావడం గుర్తు వచ్చింది....

"అబ్బ, అందర్నీ తప్పించుకుని వచ్చే సరికి బ్రహ్మప్రళయం అయింది." కరుణాకర్‌ని ఆనుకుని నిలబడింది సావిత్రి.

"జీడి పప్పులు మీ కిష్టంగా...." స్పూన్‌తో తీసి నోటికందించింది.

"భలే! భలే! కెమేరా వుంటేనా! స్నేప్ తీసేవాడ్ని." చప్పట్లు కొడుతూ యెదురుగా వచ్చి నిలుచున్నాడు మేజర్‌సింగ్. సావిత్రి సిగ్గుపడింది.

భోజనాలు అయిపోయాక ఆడవాళ్ళలోంచి యెవరో అన్నారు.

"మిసెస్ కరుణాకర్ బాగా పాడతారని విన్నాం." అని.

"అవును. ఈ వెస్టర్న్ మ్యూజిక్ బోర్ కొట్టేస్తోంది. మిసెస్ కరుణాకర్! ఒకపాట పాడి వినిపించండి."

మిసస్ సింగ్ అభ్యర్ధించింది.

"భోజనం కాక మునుపైతే పాడేదాన్నే. ఇప్పుడు ఆయాసం వచ్చేస్తుంది బాబూ!"....సావిత్రి.

బలవంతంచేసారంతా కలిసి.

సావిత్రి ఒక్కక్షణం భర్త మొహంకేసి చూసి, అక్కడే వున్న సిమ్మెంటు తిన్నెమీద కూర్చుని "రామ నను బ్రోవరా...." శ్రావ్యమైన కంఠస్వరంతో మృదు మధురంగా పాట అందుకుంది.

అప్పటి వరకూ గుండెల్ని జేజారు చేసే వెస్టర్న్ మ్యూజిక్ విని విని విసిగిపోయిన వాళ్ళకి కృతి వీనులవిందు చేసింది. పాట అయిపోగానే అందరూ చుట్టూచేరి ప్రశంసల వర్షం కురిపించారు.

"అందరి కళ్ళూ మీ మీదే. ఇలా రండి." అని యిద్దర్నీ లోపలికి లాక్కు వెళ్ళింది మిసెస్ వర్మ.

భుజంమీది చేయిపడటంతో ఉలిక్కిపడి చూశాడు కరుణాకర్.

ఎదురుగా కల్నల్ వర్మ నిలబడి వున్నారు.

"ఐ అన్డర్స్టుడ్ మైబాయ్. ఉయ్ బోత్ ఆర్ శేవింగ్ యిన్ ద సేమ్ బోట్. కమాన్....కారి ఆన్."

అతనూ కరుణాకర్ ప్రక్కనే నిలబడి తినసాగాడు. డిన్నరు ముగిసే సరికి పదిగంటలు దాటింది.

వర్మ దంపతుల దగ్గర సెలవు తీసుకుని నిద్రపోతున్న రవి చంద్రుని భుజాన వేసుకుని బయల్దేరాడు కరుణాకర్.

కారు పోర్టికోలో ఆగగానే వాకిలి తలుపులు తెరుచుకున్నాయి.

బాబుని సోఫాలో పడుకోబెట్టి పైకి వెడుతూ, యేదో గుర్తు వచ్చి వెనక్కి తిరిగి చూశాడు.

రవిని బుజాన వేసుకుని సరిత మామూలుగా నడిచి గదిలోకి వెళ్తోంది.

అతని కనుబొమ్మలు ఆశ్చర్యంగా ముడిపడ్డాయి.

మరుక్షణం అతని గుండెల్ని చీల్చుకుంటూ ఓ బరువైన నిట్టూర్పు బయటికొచ్చింది.

* * *

సావిత్రి పటానికి వేయడానికి పూలమాల కడుతూ కూర్చుంది.

బాల్కనీలో నుంచుని చూస్తే సముద్ర తీరం కనిపిస్తుంది. అందుకే ఆ యింటికి "జల దృశ్య" అని పేరు పెట్టుకున్నాడు.

సముద్రానికి ఆవల తీరాన నింగీ, నీరు యేకమైనట్లు కనిపించే ఆచోటు గుండ్రని ఎర్రని సూర్యుడు మెల్ల మెల్లగా నీటిలోకి దిగిపోతున్నాడు. ఆ సూర్యాస్తమయ సమయంలో వివిధ వర్ణాల రంగులతో శోభాయమానంగా వెలిగిపోతోంది అంబర వీధి. అస్తమిస్తున్న సూర్య కిరణాలు పడిన నీటిపాయ బంగారు తీగలా మిలమిలా మెరుస్తోంది. ఆ సుందర దృశ్యాన్ని తనివిదీరా చూస్తున్నాడు కరుణాకర్. ఆ సమయంలో రంగన్నవచ్చి "మధుబాబు మీకోసం వచ్చారు." అని చెప్పాడు.

దృష్టి మరల్చకుండానే "రమ్మను" అన్నాడు.

మధుబాబు, అతని స్నేహ బృందము బిలబిల లాడుతూ పైకి వచ్చారు.

"గుడీవినింగ్ అంకుల్!"

"గుడీవినింగ్! కూర్చోండి," కుర్చీలు చూపించాడు.

"ఏదో పనిమీద వచ్చినట్లున్నారే!"

"ఇంతకీ మేం వచ్చిన పనేమిటంటే వరదబాధితుల సహాయార్థం విరాళాలు సేకరిస్తున్నాం అంకుల్."

"చాలా సంతోషం మీవంటి ఉత్సాహంగల యువకులు ఇలా ముందుకొస్తే అంతకన్నా కావలసిందేముంది. విష్ యు బెస్ట్ ఆఫ్ లక్." అంటూ చెక్ వ్రాసిచ్చాడు.

"థాంక్యూ అంకుల్! థాంక్యూ"

మధుతోపాటు అతని మిత్ర బృందమూ లేచి కరుణాకర్‌కి కృతజ్ఞతలు తెలియజేసారు.

వాళ్ళని మెట్లవరకూ సాగ నంపటానికి వచ్చిన కరుణాకర్ క్రింద దృశ్యం చూసి ఆగిపోయాడు.

సరిత చుట్టూ చేరిన అమ్మాయిలు "మీయిష్టం. మీకు తోచిందే యివ్వండి. ఆఖరికి మీరు కట్టి విడిచిన చీరలైనా సరే. ఇదిగో ఇందులో చూడండి. ఒంటినిండా బట్టకైనా నోచని వరద బాధితు లెందరో!" ఫోటోలు సరిత చేతిలో పెట్టింది వో అమ్మాయి.

సరిత కళ్ళు చెమ్మగిల్లాయి. మనసు ఆర్ద్రమయింది. వారికి తనే మివ్వగలదు? తనదీ అంటూ యీ యింట్లో యేముంది గనుక యిస్తుంది. వచ్చేటప్పుడు వెంట తెచ్చుకున్న చీరలు చిరుగులు పట్టాయి. మరీ అటువంటివి యిస్తే బాగుండదు.

క్షణం ఆలోచించి చేతికున్న రెండుజతల బంగారు గాజులూ తీసి, ఆ అమ్మాయి చేతిలో పెట్టింది.

"థాంక్సు అండీ! మీరు సహృదయంతో యిచ్చిన యీ గాజులు తప్పక సద్వినియోగం చేస్తాం." అంటూ భుజానికున్న బేగ్‌లో వేసుకుంది ఆ అమ్మాయి.

అబ్బాయిలూ, అమ్మాయిలూ కలిసి వెళ్ళిపోయారు.

*  *  *

సరిత రాసిన నవలకు బహుమతి వచ్చింది. పత్రికవాళ్లు వెయ్యి రూపాయిలు పంపారు.

ఆ సాయంత్రం పిల్లల్ని వెంటపెట్టుకెళ్ళి తనకి నాలుగు చీరలు, పిల్లలకి ఆటవస్తువులు, రంగన్నకి ఒక పంచలజత, గాజులు కొన్నది.

ఇంటికి తిరిగొచ్చేసరికి హాలులో కరుణాకర్ కూర్చుని ఆ రోజు పేపర్ చూస్తున్నాడు.

నిండా కొంగు కప్పుకుని గబగబా నడిచి లోనికి వెళ్ళిపోయింది సరిత. పిన్నిచేయి విడిపించుకుని తండ్రి దగ్గరకు పరుగుపెట్టాడు రవిచంద్ర. "డాడీ! మేం బజారువెళ్లాం. పిన్ని, యిన్ని చీరలూ, గాజులూ బట్టలూ అన్నీ కొంది" అభినయిస్తూ చెప్పాడు.

గాజులు దానంగా యివ్వడం చూచినప్పటినుంచీ కరుణాకర్‌కి

సరిత అంటే కోపంగావుంది. ఇప్పుడు బాబు చెప్పిన మాటలతో కోపం రెట్టింపయింది.

సావిత్రికి నగలంటే చెప్పలేనంత మోజు. ఎన్ని నగలున్నా కొత్తవి చేయించుకుంటూనే వుండేది. వాటిని ఎంతో ప్రాణంగా దాచుకునేది. సావిత్రికి ప్రాణప్రదమైన నగల్ని, సరిత దానంగా యిచ్చేసింది అనుకున్నాడు కరుణాకర్.

"దానధర్మాలు, ఖర్చులూ తగ్గించుకోమని మీ పిన్నికి చెప్పు" సరితకి వినబడాలనే గట్టిగా అని చివ్వున లేచి వెళ్ళిపోయాడు.

ఈ మాట విన్న సరిత మనసు వేటగాడి బాణందెబ్బ తిన్న లేడిలా విలవిలలాడింది.

తన సొంత డబ్బుతో చీరలు కొనితెచ్చుకున్నానన్న సంతోషం తుడుచుకుపోయింది. అతని మాటలే చెవిలో గింగురుమంటూంటే చేతిలోని పాకెట్ టేబులుమీద పడేసి ఉసూరుమంటూ మంచం కొసన చతికిలబడిపోయింది.

ఆ రాత్రి....ట్రేలో పాలగ్లాసుతో పాటు రెండు పుస్తకాలు, తాళం చెవులూ పెట్టి రంగిన్న చేతికిచ్చింది.

అవి చూసి కరుణాకర్ కనుబొమలు ముడిపడ్డాయి. ఒకటి పాస్‌బుక్, రెండవది తీసిచూశాడు. ప్రతినెలా యింటిఖర్చు. అణా, పైసలతో సహా వ్రాసివుంది. బాబు స్కూల్‌ఫీజులు. బర్త్‌డేకయిన ఖర్చు. అన్నీ వివరంగా వ్రాసివున్నాయి. ఎక్కడా సరితకోసం ఖర్చయినట్లులేదు. పేజీలన్నీ తిప్పాడు. ఆ రోజు ఏకౌంట్ కూడా వ్రాసివుంది. అందులో సరిత చీరలకీ గాజులకీ, ఖర్చయినట్లు ఎక్కడాలేదు. 'అయితే తనే పొరబడ్డాడు. అసలు తనిస్తున్నదానిలో అంత మిగలడం అసంభవమే.

సావిత్రి నగలు దానంగా యిచ్చిందన్న కోపం మనసులో వుండి అలా అనేశాడు. సావిత్రే లేకపోయాక ఆ నగలతో తనకి సంబంధమేమిటి? తొందరపడి ఆ పిల్లమనసు కష్టపెట్టాను. అనుకున్నాడు. 'ఐతే ఆ చీరలు యెలా కొంది? పుట్టింటినుంచి డబ్బు తెప్పించుకుందా?....తనకెంత అవమానం. సరే. ప్రతీ నెలా మరో

ఐదొందలు ఎక్కువ యిస్తే సరిపోతుంది.' అనుకుని వాటి నలాగే పెట్టి తిరిగి క్రిందికి పంపేశాడు కరుణాకర్.

* * *

కరుణాకర్‌తోపాటు మరో వ్యక్తి కారుదిగి లోపలికి రావడం చూసి ఫ్లవర్ వాజులో పూలు అమరుస్తున్న సరిత చప్పున అక్కడి నుంచి తప్పుకుంది.

గదిలో అడుగుపెడుతూనే సావిత్రి పటానికి వేసున్న పూల మాల, వెలుగుతున్న అగరవత్తులు చూసి నిర్ఘాంతపోయి టక్కున ఆగిపోయాడు శరత్.

"కరుణా! ఏమిటిది?" అడగలేక అడిగాడు.

"జీవిత నాటకంలో ఆమె పాత్ర ముగిసిపోయింది. వెళ్ళిపోయింది" వేదాంత ధోరణిలో సమాధానమిచ్చాడు కరుణాకర్.

"నాకెందుకు వ్రాయలేదు?"

"ఇంకొకర్ని బాధపెట్టడం యిష్టంలేక."

"కరుణా!" శరత్ యేదో అనబోతుండగా అతనికా అవకాశం యివ్వకుండా "వస్తా వుండు." అని లోపలికి వెళ్ళాడు కరుణాకర్.

అప్పుడు రెండుగంటల సమయం అవడంవలన నౌకర్లంతా పెరటివైపు చెట్లక్రింద పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నారు. రంగన్న యేదో పనిమీద బయిటికి వెళ్ళాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. సరిత గదివరకూ వెళ్ళి ఆగిపోయాడు కరుణాకర్.

కనబడీ—కనబడనట్లు తలుపు ప్రక్కకొచ్చి నిలుచుంది సరిత.

"శరత్ కొన్నాళ్ళపాటు యిక్కడుండాలని వచ్చాడు. అతనికే లోటూ జరక్కూడదు."

సరిత విని వూరుకుంది.

ఇంకొక్క క్షణంకూడా అతనక్కడ ఆగలేదు. శరత్‌కి గెస్టు రూమ్ చూపించి "రెస్టు తీసుకో త్వరగా వచ్చేస్తాను." అని చెప్పి వెళ్ళిపోయాడు కరుణాకర్.

కిటికీలోంచి తోటవైపు చూస్తూ చాలాసేపు ఆలోచిస్తూ నిలబడ్డాడు శరత్.

* * *

శరత్ నిద్ర లేచేసరికి, రంగన్న కాఫీ ఫలహారాలతో సిద్ధంగా వున్నాడు. ఫలహారం పూర్తిచేసుకుని తోటవైపు నడిచాడు శరత్. మొక్కలన్నీ పచ్చగా నిగనిగలాడుతున్నాయి. రకరకాల గులాబులు, సీజన్ పూచెట్లు కమ్మని వాసనలు వెదజల్లుతున్నాయి. పచ్చని తివాసీ పరిచినట్లు నలుచదరంగా లాన్. లాన్ మధ్యలో నీళ్లు చిమ్ముతున్న ఫౌన్‌టెన్. ఎక్కడా ఒక్క ఎండుటాకుగానీ, పుల్లముక్కగానీ కనపడలేదు. తోటని ఎంతో శ్రద్ధతో పెంచుతున్నట్లు తెలుస్తూంది.

శరత్ తోటంతా తిరిగొచ్చి పారిజాతం చెట్టుక్రింద చెప్టామీద కూర్చున్నాడు.

వాతావరణం ఆహ్లాదకరంగా వున్నది. అక్కడికి కొద్ది దూరంలో రంగన్న చెట్లకి నీళ్ళు పెడుతున్నాడు.

"తోట బాగా పెంచావు తాతా! నీకు సర్టిఫికెట్ యివ్వాల్సిందే" శరత్ అన్నాడు.

"నాదేముంది బాబూ! అంతా అమ్మాయిగారి శ్రమే! వద్దన్నా వినకుండా సగంపని ఆయమ్మే చేస్తారు."

వెంటనే శరత్ బొమ్మ వెంట్రుకలు ముడిపడ్డాయి.

"అమ్మాయిగారు....అంటే?"

రంగన్న చెప్పబోయాడు. అంతలో కరుణాకర్ తోటలోకి రావడం చూసి, రంగన్న తన పనిమీద వెళ్ళిపోయాడు.

శరత్ అనుకున్నాడు. "భార్యపోయిన దుఃఖంలో వున్నాడు. ఈ సమయంలో తన కథంతా చెప్పుకుని అతని మనసు కష్టపెట్ట కూడదు. తనున్న నాలుగు రోజులూ అతన్ని నవ్విస్తూ వుంచాలి."

చెప్టామీద కూర్చుని తనవైపే చూస్తున్న శరత్‌ని చూసి కరుణాకర్ మనసు చివుక్కుమంది.

"శరత్ చాలా మారిపోయాడు. బలహీనంగా కనిపిస్తున్నాడు. చలాకీగా, హుషారుగా భూమ్మీద కాలు నిలవనట్లు తిరిగే శరత్ మందకొడిగా....ఏదో పోగొట్టుకున్న వాడిలా యుద్ధంలో వోడిపోయిన వీరుడిలా దిగాలుగా వున్నాడు. ఏదో జరిగుంటుంది. అతని ముందు తన విచారం వ్యక్తం కానీకూడదు__"

స్నేహితులిద్దరూ కబుర్లలో పడిపోయారు. అయితే వాళ్ళ కబుర్లలో సహజత్వంలేదు. నవ్వుల్లో నిండుదనంలేదు. ఆ సంగతి ఎవరిమటుకు వాళ్ళు గ్రహించినా యెవరూ పైకి తేలలేదు.

భోజనాలకి పిలుపు వచ్చేవరకూ మాట్లాడుకుంటూనే వుండి పోయారు.

మరుచటిరోజు కరుణాకర్ ఆఫీసు పనిమీద ఢిల్లీ వెడుతూ రెండు రోజులవరకూ రాననీ, తనొచ్చేలోగా వెళ్ళొద్దనీ శరత్‌కి చెప్పి వెళ్ళాడు.

* * *

శరత్, కరుణాకర్ ప్రాణస్నేహితులు. వాళ్ళ పరిచయం కాలేజి రోజుల్లో జరిగింది. శరత్, లక్షాధికారి బిడ్డ. అతను సెకండు పాసయిన సంవత్సరమే తండ్రి గుండెపోటుతో మరణించాడు. కాలేజిలో చేరి చెడు సాహసాలు పట్టి దారితప్పి తిరుగుతున్న శరత్‌ను అన్నలా ఆదరించి ఒక దారికి తెచ్చారు కరుణాకర్. శరత్ తల్లి అరుణాదేవికి కరుణాకర్ అంటే ఎంతో అభిమానం కలిగింది. వారి కుటుంబానికి ఎంతో సన్నిహితుడయ్యాడు కరుణాకర్.

ఉద్యోగాల్లో చేరాక స్నేహితులమధ్య రాకపోకలు తగ్గి పోయాయి. పి.హెచ్.డి. చేయడానికి విదేశాలకు వెళ్ళిన శరత్ నాలుగునెల్ల క్రితమే స్వదేశానికి తిరిగివచ్చాడు.

చాలాకాలం తరువాత స్నేహితుణ్ణి చూడాలనీ, మనసులోని వ్యథని అతని సాన్నిధ్యంలో మర్చిపోవాలనీ వచ్చాడు శరత్.

* * *

శరత్ వచ్చిన రెండోరోజు—

ఉదయం బయటికి వెళ్ళిన శరత్ మూడుగంటల సమయంలో ఇంటికి తిరిగొచ్చి బట్టలన్నా మార్చుకోకుండా మంచంమీద వాలిపోయాడు.

సరిత తన గదిలో కూర్చుని పాపకి స్వెటర్ అల్లుతున్నది.

రంగన్న చెట్లకి బోదెలు తవ్వుతున్నారు.

ఆ రోజు రవిచంద్రకి స్కూల్ లేదు.

పాప నిద్రపోతున్నది. పిన్నిని పలకరిస్తే 'ఆఁ—ఊఁ' అని ఊరుకుంది. వాడికి యేం తోచడంలేదు. హాల్లో కొచ్చాడు. బాబుతో ఆడబుద్ధి కాలేదు. అల్మారాలో రకరకాల బొమ్మలు వాడిని ఆకర్షించాయి. క్రింద వరుసనుండి ఒక్కొక్క బొమ్మే తీసి నేలమీద పేర్చాడు.

పై అరలో డాన్సుబొమ్మ కళ్ళబడింది. దాన్ని అందుకోవాలనుకున్నాడు.

కుర్చీమీదినుండి అల్మారా రెండు అరలూ ఎక్కేసి మూడో అరలోని డాన్సుబొమ్మ అందుకోబోయాడు. బొమ్మ బరువుగా వుండి కదలలేదు. రెండవచేయి కూడా వుపయోగించబోయాడు. అంతే పట్టుతప్పి 'ధన్'మని క్రింద పడిపోయాడు.

ధన్‌మన్న చప్పుడూ ఆ వెంటనే పెద్ద యేడుపు విని పరుగెత్తుకొచ్చింది సరిత.

కుర్చీని ప్రక్కకి జరిపి,క్రిందపడివున్న బాబుని చేతుల్లోకి తీసుకుని లేచేసరికి ఎదురుగా. శిలావిగ్రహంలా నిలబడివున్నాడు శరత్.

క్షణం ఆలస్యం చేయకుండా బాబుని బుజాన వేసుకుని పరుగులాంటి నడకతో గదిలోకి వెళ్ళి తలుపు మూసుకుంది సరిత.

తను చూచింది సరితనేనా?....

సరిత యిక్కడ యెలావుంది? శరత్‌కి యింకా నమ్మకం కలగటంలేదు.

ఆకాశం వచ్చి భూమ్మీద పడినా, నవగ్రహ కూటమి కళ్ళ ముందు తగలబడిపోయినా అతనంత ఆశ్చర్యపోయేవాడు కాదేమో! కానీ, సరిత కరుణాకర్ యింట్లో! యెలా నమ్మడం?? అతనికంతా అయోమయంగా, గంద్రగోళంగా వుంది.

రవిచంద్రుని యేడుపు విని పరుగెత్తుకొచ్చిన రంగన్న చిందరవందరగా పడివున్న బొమ్మలమధ్య కంచువిగ్రహంలా నిలబడివున్న శరత్‌ని చూచి ఆశ్చర్యపోయాడు.

క్రింద పడివున్న వస్తులను తీస్తూ "బాబూ!" అని పలకరించాడు.

అప్పటికి తేరుకున్న శరత్ "రంగన్నా! రవినెత్తుకెళ్ళిందే.... ఆవిడెవరు?" అడిగాడు.

"బాబుగారి రెండో భార్య" పగిలిపోయిన గాజుముక్కలను ఏరి చేతిలో వేసుకుంటూ జవాబిచ్చాడు.

గిరుక్కున వెనక్కి తిరిగి, పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ ద్వారగుమ్మం దాటి వెళ్ళిపోతున్న శరత్‌ని ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు రంగన్న.

*    *    *

సముద్రతీరంవెంట నడుస్తున్నాడు శరత్. అలా యెంతదూరం నడిచాడో కాళ్ళు యిక ముందుకు సాగలేదు. కూర్చుండిపోయాడు.

చీకటి చుట్టుముట్టింది. మేఘాలు నల్లబడ్డాయి.

చల్లగాలి తిరిగింది. సన్నగా జల్లు కురవడం ప్రారంభించింది. ఇసుకలో తలక్రింద చేతులు పెట్టుకుని అలా పడుకుని ఆకాశంవంక చూస్తూనే వున్నాడు శరత్.

అతనికి లేవాలనిపించలేదు. ఓ పది నిముషాలు జల్లులా కురిసిన వాన ఆగిపోయింది.

"శరత్! నేను, నీ దాన్ని. మూడేళ్ళుకాదు. మూడు యుగాలైనా నీ కోసం యెదురుచూస్తూ వుంటాను" అంటూ గువ్వలా తన కౌగిలిలో ఒదిగిపోయిన సరిత యీనాడు కరుణాకర్ అర్ధాంగి. శరత్ మనసు విలవిలలాడింది. గతం కళ్ళముందు కదలాడింది.

ఆ రోజు కాలేజ్ డే!

కాలేజీ ఆడిటోరియమ్ స్టూడెంట్సుతో కిటకిటలాడుతోంది. ఒకవైపు వరుసలో ఆడపిల్లలు. మరోవైపు మొగపిల్లలు.

ముందు వరుసలో ప్రిన్సిపల్, స్టాఫ్, ముఖ్యఅధితులు కూర్చున్నారు.

"కార్యక్రమం ప్రార్ధనాగీతంతో ప్రారంభిస్తున్నాము. మిస్ సరిత బి.ఎ. ఫస్టియర్ పాడతారు" ఎనౌన్స్‌మెంటుతోపాటు కర్టెన్ మెల్లగా పైకి లేస్తుంటే అంతా నిశ్శబ్దంగా కూర్చుని స్టేజివైపు చూడసాగారు.

నీలిరంగు చీర, జాకిట్టు. మెడలో అదేరంగు పూసలదండ. చెవులకు నీలిరంగు టాప్స్. మేఘమాలికలా నిలుచుకుంది సరిత.

సరిత పాడిన పాట పూర్తయింది. కరతాళ ధ్వనులతో హాలు ప్రతిధ్వనించింది. ఒకరిద్దరు స్టూడెంట్సు "ఒన్స్‌మోర్" అని అరిచారు కూడా. కర్టెన్ దిగిపోయింది.

ఒథెల్లో నాటకం జరుగుతుండగా వున్నట్లుండి లైట్లు పోయాయి.

అంతా ఒక్కమారుగా ఘొల్లున అరిచారు.

'ఇదే ఛాన్సు' అనుకుని కొందరు కొంటెకారు ప్రక్కనున్న ఆడపిల్లల మీద చేతులువేసి తడమసాగారు.

వెలుతురైతే సభ్యత అడ్డమొస్తుంది. చీకట్లో చూసేదెవరు? గుంపుల్లో గోవింద. విద్యార్థుల్లో విచక్షణాజ్ఞానం పోయింది.

"అరవకండి. ఎవరి సీట్లల్లో వాళ్ళు కూర్చోండి. లైట్లు రాగానే తిరిగి కార్యక్రమం ప్రారంభిస్తారు" ప్రిన్సిపల్ అరిచి చెపుతున్నాడు.

వినేదెవరు? గుంపులో వున్నామనే బలం. చీకటిచ్చిన ధైర్యం, చీకటి....గోల.

అంతలో దూరంగా కర్ణపేయంగా మౌత్ఆర్గన్ వినవచ్చింది.

ఒకొక్కరే చెవియొగ్గి వినసాగారు.

వాలంటీర్లు కాండిల్సు వెలిగించారు.

మసక వెలుతురులో ఎవరో స్టేజిమీద నిల్చుని హుషారైన గీతాలను అద్భుతంగా రాగాలు పలికిస్తూ శ్రోతలను వుయ్యాల లూగించే విధంగా వాయిస్తుంటే ఎక్కడివాళ్ళక్కడ నిలిచిపోయారు.

రెండు నిముషాల్లో పిన్నుపడితే వినిపించేటంత నిశ్శబ్దంగా మారిపోయింది ఆడిటోరియమ్.

తన వాయిద్యంతో శ్రోతలను ఉక్కిరిబిక్కిరి చేసి వూరిస్తున్నా డతను.

ఐదు నిమిషాలు ఐదుక్షణాల్లా గడిచిపోయాయి.

గుప్పున లైట్లు వెలిగాయి.

స్టేజి దిగిపోతున్న శరత్‌ని చూచి "వీల్లేదు. మైకులో అందరికీ వినపడేలా వాయించాలి" అంటూ గోలచేసారు విద్యార్థులు.

శరత్ స్టేజిమీది కొచ్చి వాళ్ళ కోరిక తీర్చాడు.

తిరిగి కార్యక్రమం ప్రారంభమయింది.

ప్రిన్సిపల్, శరత్‌ని అభినందించాడు. "నువ్వలా పిల్లల్ని ఎంగేజ్‌చేసి వుంచకపోతే ఎంత గొడవ జరిగేదో. మన కాలేజి పరువు దక్కించావు" అంటూ ఒకటి రెండుసార్లు థాంక్స్ చెప్పుకున్నాడు.

కార్యక్రమం ముగిసేసరికి ఎనిమిది గంటలు దాటింది.

ఆడపిల్లలందరూ శరత్ చుట్టూ మూగారు.

అభినందించిన వాళ్ళకి కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోతున్న శరత్ దూరంగా నిల్చున్న సరితను చూచి ఆగాడు.

"మీరు రెండవసారి పాడారు చూడండి. ఆ పాట నా ఫేవరేట్ సాంగ్. బాగా పాడారు" సరితని పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"థాంక్స్" తలెత్తకుండానే అంది.

అతని వాయిద్యాన్ని అందరూ మెచ్చుకున్నారు. తను ఒక్క ముక్కైనా అనకపోతే బాగుండదు. ఏదో అనాలని తలెత్తింది.

నాలుగు కళ్ళూ కలుసుకున్నాయి.

ఒక్క క్షణం గుండె లయ తప్పింది.

చటుక్కున తల దించేసుకుని అనాలనుకున్నమాట అనకుండానే గబగబా అక్కడినుంచి వెళ్ళిపోయింది సరిత.

శరత్ నవ్వుకున్నాడు.

* * *

ప్రక్కగా స్కూటర్‌వచ్చి ఆగడంతో తల తిప్పి చూచింది సరిత.

"మీతో ఒక్క నిముషం మాట్లాడాలి. అలా పార్కులోకి వస్తారా?" శరత్ అడిగాడు.

"నాతోనా?!" కళ్ళు పెద్దవి చేసుకుని ఆశ్చర్యంగా చూచింది.

"ఊఁ మీతోనే" అందంగా నవ్వాడు.

"వెళ్లాలా, వద్దా" అని క్షణం తటపటాయించి "సరే పదండి" అంది.

ఇద్దరూ కాస్త దూరం నడిచి ఓ చెట్టుక్రింద కూర్చున్నారు.

ఒడిలో పుస్తకాలు పెట్టుకుని వాటినే చూస్తూకూర్చుంది సరిత.

ముట్టుకుంటే కందిపోయే రంగు, నేర్పరియైన శిల్పి చెక్కిన శిల్పసుందరిలా,తీర్చిదిద్దినట్టున్న సరిత రూపాన్నే చూస్తున్నాడు శరత్.

రెండు నిముషాలు మౌనంగా గడిచాయి.

సరితకి ముళ్ళమీద కూర్చున్నట్లుంది.

తనతో మాట్లాడవలసిన విషయం మేముంటుంది?

తలతిప్పి చూచింది.

అప్పటివరకూ సరితనే తదేకంగా చూస్తున్న శరత్. తల తిప్పుకుని ఎదురుగా వున్న చెట్టువైపు చూస్తూ "మీరు సంగీతం నేర్చుకున్నారా?" అడిగాడు.

"ఊఁ"

"ఐ లైక్ మ్యూజిక్ వెరీమచ్."

"..........."

"మీరు కాలేజీలో పాడటం యిదే ఫస్ట్‌టైమ్ అనుకుంటాను."

"ఊఁ."

"మీ పాట మళ్ళీ మళ్ళీ వినాలని వుంది."

"..........."

"మీకు పాడటంతప్ప, మాట్లాడటంరాదా?" శరత్ సీరియస్‌గా అడిగేసరికి తలెత్తిచూచి నవ్వింది సరిత.

క్షణం సరిత కళ్ళల్లోకి చూచి అతనూ నవ్వేశాడు.

వాచీ చూసుకుని లేచింది.

"సారీ! యీ బస్ మిస్‌చేస్తే మళ్ళీ గంటవరకూ బస్సుకోసం వెయిట్ చెయ్యాలి. నమస్తే!" అతని సమాధానానికి యెదురుచూడకుండా వడివడిగా గేటువైపు నడిచింది.

* * *

ఆ మరుసటిరోజు సాయంత్రం సరితని కలుసుకోవాలని పార్కుదగ్గర వేచివున్నాడు శరత్.

స్నేహితురాళ్ళ మధ్య నడుస్తూ వచ్చిన సరిత, అతన్ని కన్నెత్తయినా చూడకుండా వెళ్ళిపోయింది.

నాలుగు రోజులలా గడిచేసరికి శరత్ మనస్సు ఉక్రోషంతో కుతకుత వుడికిపోయింది.

'కావాలనే అలా తప్పించుకు పోతున్నది. వంటరిగా దొరకనీ చెప్తాను.' అనుకున్నాడు.

మధ్యాహ్నం ఆఖరి పిరియడ్ క్లాసులేక స్టాఫ్ రూమ్‌లో కూర్చున్నాడు శరత్.

మెట్లమీదినుండి లైబ్రరీవైపు వెడుతూ కనుపించింది సరిత.

అతనూ లేచి వెళ్లాడు.

టేబులుముందు కూర్చుని శ్రద్ధగా పుస్తకం చదువుతూ మధ్య మధ్య ప్రక్కనున్న నోట్‌బుక్‌లో పాయింట్సు నోట్ చేసుకుంటున్నది సరిత.

వెళ్ళి ఎదురుగావున్న కుర్చీలో కూర్చున్నాడు.

చదవడంలో నిమగ్నమైన సరిత తలెత్తి చూడలేదు.

చేతిలోని పుస్తకం శబ్దం అయ్యేలా టేబులుమీద పడేశాడు.

తలెత్తి చూచింది.

తీక్షణంగా, సూటిగా ఒక్కక్షణం చూచి చర్రున లేచి వెళ్ళిపోయాడు శరత్.

అతని ప్రవర్తనకు విస్తుపోయింది. తిరిగి పుస్తకం చదవడంలో నిమగ్నమయింది.

ఆ సాయంత్రం కాలేజీ విడిచాక వంటరిగా వస్తున్న సరితను దారిలోనే అడ్డగించాడు శరత్.

''నేనేం రాక్షసుడి ననుకున్నావా? అలా తప్పించుకుని పారిపోతున్నావ్?'' అంటూ నిలదీసి అడిగాడు.

సరిత తెల్లబోయింది

తన పెద్దపెద్ద కళ్ళతో ఒక్కక్షణం అతనివైపు చూచి తల దించుకుంది.

అమాయకంగా తనవైపు చూస్తున్న సరితను చూచేసరికి శరత్ మనసు మెత్తబడింది. "ఈ రోజు మీరు, మా యింటికి రావాలి" అన్నాడు సౌమ్యంగా.

"మీ యింటికా?! ఎందుకూ?" తలెత్తి విస్మయంగా అడిగింది.

"మీ పాట వినాలని వుంది. ఒక్కసారి పాడి వినిపించారంటే టేప్ చేసుకుని దాచుకుంటాను."

తను పిలవగానే ఆనాడు పార్కులోకి వెళ్ళినందుకేగా యీసారి యేకంగా యింటికి రమ్మంటున్నాడు. సరితలో అభిమానం తలెత్తింది.

"నేను రాను" అన్నది స్థిరంగా.

"ఎందుకనీ?" నవ్వుతూ అడిగాడు.

"మీరు రమ్మన్న చోటికంతా రావడానికి నేనేం మీ 'గర్ల్ ఫ్రెండ్' ననుకొంటున్నారా? పరువు, మర్యాదగల ఒక యింటి ఆడ పిల్లని" వడివడిగా అక్కడినుంచి వెళ్ళిపోయింది.

నిశ్చేష్టుడై నిలబడిపోయాడు శరత్.

ఇంటికి వెళ్ళి పడుకున్నాడు. సరిత మాటలే గుర్తురాసాగాయి. "మీరు రమ్మన్న చోటికంతా రావడానికి నేనేం మీ...." ఎంత గర్వం? ఇప్పటివరకూ తననలా ఎదిరించి మాట్లాడినవాళ్ళు లేరు. అమ్మనీ, కరుణాకర్‌నీ తప్ప తనెవర్నీ లెక్కచేయలేదు. చేయడు కూడాను. అయినా తనేం తప్పుగ అనలేదే! గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

'అసలా పిల్లను కన్నెత్తి చూడకూడదు. అవకాశం వచ్చి నప్పుడు బాగా యేడ్పించి బుద్ధిచెప్పాలి.' నిర్ణయించుకున్నాడు.

ఆ రాత్రి అక్కడ సరితకి నిద్రపట్టలేదు. తనే తొందర పడింది. అతని స్వభావమే అంతగాబోలు. అతన్ని ఆకర్షించాలని ప్రయత్నించి ఓడిపోయిన అమ్మాయిలేదు కాలేజీలో. అందరికీ అతను అందని అందాల జాబిల్లి. గగన కుసుమం. తన పాటను మెచ్చుకుని యేదో తనతో చనువుగా మాట్లాడినంతమాత్రాన అతని విలువ తెలుసుకోకుండా ఎదిరించి మాట్లాడింది. అతడెక్కడ? తనెక్కడ. ఈసారి కలిస్తే క్షమించమని అడిగెయ్యాలి." ఆలోచిస్తున్న సరితకు ఎప్పటికోగానీ నిద్రపట్టలేదు.

*　*　*

పార్కు దగ్గరకు వచ్చేసరికి శరత్ దర్శనం కావడంలేదు సరితకి. ఏదో వెలితిగా వుంటోంది. ఆరోజు కాలేజీలో జరిగిన వక్తృత్వపు పోటీలో పాల్గొంది సరిత. పోటీలు ముగిసి యింటికి బయల్దేరే సరికి సాయంత్రం ఆరుగంట లయింది.

రోడ్డు మీద గడిచినా బస్ వస్తున్న జాడలేదు. సరితకి విసుగ్గా వుంది. అప్పటివరకూ పాన్‌షాపు దగ్గర నిలబడి సరితనే గమనిస్తున్న ఒక యువకుడు మెల్లగా సరిత దగ్గరగావచ్చి "టైమ్ యెంతయింది మిస్?" అని అడిగాడు.

తల తిప్పి చూచి మౌనంగా వుండిపోయింది.

విలాసంగా సిగిరెట్ పీలుస్తూ రింగులు రింగులుగా పొగ సరిత మీదికి వదల సాగాడు అతను.

ఆ వాసనకి కడుపుల్లో తిప్పినట్లనిపించి యెడంగా జరిగి నిలబడింది.

అతను మరికాస్త దగ్గరగావచ్చి "మీరు ఏబస్సుకి వెళ్ళాలి?" ప్రశ్నించాడు.

సరిత ముఖం చిట్లించుకుంది.

"పోనీ ఆటోలో వెళ్ళిపోదామా?" చొరవగా వచ్చి ప్రక్కనే నిలబడ్డతన్ని చురచుర చూసి చటుక్కున పుట్‌పాత్ దిగి రోడ్‌మీది కొచ్చేసి నిలబడింది.

సరిత అలా నిలబడటమూ, అదే సమయంలో ఓ స్కూటర్ వచ్చి ఆమె ప్రక్కగా ఆగడమూ యేక కాలంలో జరిగిపోయాయి.

"బస్ మిస్ చేసారా?" శరత్ అడిగాడు.

ఆ సమయంలో శరత్ దేవుడిలా కనుపించాడు సరితకి.

ప్రక్కకు తిరిగి చూసింది.

అప్పటివరకూ సతాయిస్తూ వెంటపడ్డ యువకుడు తిరిగి పాన్ షాపు దగ్గర నిల్చుని యిటే చూస్తున్నాడు.

"బస్ యెప్పుడొస్తుంది?" వాచీ చూసుకుంటూ అడిగాడు.

"ఏమో, తెలీదు. గంటనుంచీ నుంచున్నాను." ఇంచు మించు గాద్గదిక స్వరంతో అన్నది.

ఒక్కక్షణం సరిత మొహంలోకి చూచి "ఐతే రండి నేను డ్రాప్ చేస్తాను." అన్నాడు.

అతను అనడమే తడవుగా స్కూటరెక్కి కూర్చుంది సరిత. నవ్వుకుంటూ స్కూటర్ స్టార్ట్‌చేశాడు శరత్. రివ్వున దూసుకు పోతున్న స్కూటర్ నెహ్రూ పార్కుదాటి కొద్దిదూరం పోయేసరికి తక్కున ఆగిపోయింది. సరిత దిగి నిలబడింది.

బండిని రోడ్డుప్రక్కగా తీసుకెళ్ళి పరీక్ష చేయడంలో నిమగ్నమై పోయాడు శరత్.

"బుద్ధొచ్చింది, ఇంకెప్పుడూ యిలా ఆలస్యం చేయకూడదు." అనుకుంటూ చుట్టూ చూస్తూనుంచుంది సరిత.

"ఒకవేళ స్కూటర్ బాగుకాకపోతే!" సరిత గుండె దడదడలాడింది. ఇంకా సగందూరం పోవాలి. బస్సు యిటుగా వచ్చినా మధ్యలో ఆపమన్నా ఆపడు....

స్కూటర్ శబ్దం విని తిరిగిచూచింది, వచ్చిన దారినే వెళ్ళి పోతున్నాడు శరత్.

ఇదేమిటి తన సంగతి మర్చిపోయాడా యీ మహానుభావుడు! అంత చల్లగాలిలోనూ చిరుచెమటలు పోసుకొచ్చాయి సరితకి.

"సార్!....సార్!" గొంతు పెగుల్చుకుని కేక పెట్టింది. శరత్ వెనక్కి తిరిగి చూడలేదు.

ఓచేత్తో బుజానవున్న బేగ్ పట్టుకుని, రెండవ చెయ్యి పైకెత్తి "శరత్! .... ఆగండి".... కేక పెడుతూ స్కూటర్ వెనుక పరుగు పెట్టింది.

అతను వెనక్కి తిరిగిచూశాడు. స్కూటర్ టర్న్ చేసుకొచ్చి ప్రక్కనే ఆపుతూ "యెందుకలా వెంటపడి పరిగెత్తు కొస్తున్నావ్ నాతో రావడానికి నువ్వేం, నా...." సగంలోనే ఆపేసి సరిత ముఖం లోకి సూటిగాచూశాడు. గుండెలమీద చెయ్యి వేసుకుని ఆయాస పడుతున్న సరిత అతని మాటలకి చివ్వున తలెత్తి చూచింది.

"అయితే మర్చిపోయి కాదన్నమాట వెళ్ళిపోయింది."

పావుగంట క్రితం దేవుడిలా కనుపించిన తను యిప్పుడు

రాక్షసుడిలా కనుపించ సాగాడు.

ఆరోజు దురుసుగా మాట్లాడినందుకు క్షమించమని అడగాలనీ, ఆ దుష్టుడి బారినుండి తప్పించి తీసుకొచ్చినందుకు ధన్యవాదాలు చెప్పుకోవాలనీ అనుకున్న సరిత మనసు ఆ క్షణాన యెదురుతిరిగింది.

ఏ మనుకొన్నాడో గాని. "వచ్చి కూర్చో" .... అన్నాడు స్కూటర్ సరిత ప్రక్కకు తెస్తూ.

మొఖం తిప్పయినా చూడలేదు సరిత. అక్కడనుంచి వడి వడిగా వెళ్ళబోయింది.

చప్పున రెక్క పుచ్చుకు ఆపాడు.

"ఒదలండి." అతను పట్టుకున్న చేతిని విదిలించుకో బోయింది.

అతనిచేయి మరింత బిగుసుకుంది.

సరిత గుడ్లల్లో గిర్రున నీరు తిరిగింది.

"ఒదలమంటుంటే మిమ్మల్నికాదూ!" విడిపించుకోడానికి ప్రయత్నించింది.

రెండు క్షణాలు వూరుకుని "నేనే వోడిపోయాను," అంటూ చేయి వదిలేసాడు శరత్.

అతనివైపు ఆశ్చర్యంగా చూచింది.

"ప్లీజ్! వచ్చి కూర్చోండి!"

క్షణంలో చిత్రంగా మారిపోయిన అతని ప్రవర్తనకు విస్తు బోతూ యితన్ని నమ్మాలా? వద్దా? అన్న సందిగ్ధంలో పడింది.

"ప్లీజ్ రండి. లేకపోతే మీకూ, నాకూ కూడా ఆలస్య మవుతుంది."

అభ్యర్థిస్తున్నట్లుగా అన్నాడు.

మౌనంగా వచ్చి వెనక సీట్లో కూర్చుంది.

గాలికి చెదిరి మొహం మీద పడుతున్న వెంట్రుకలను ఒక్క విదిలింపుతో ప్రక్కకు తోసుకుని గాలితో పోటీ పడుతున్నట్లు తీసుకు పోసాగాడు.

"ఆపండి! ...."

స్కూటర్ ఆగడమే తడవుగా దూకినట్లు దిగి వెళ్ళిపో బోయింది.

"సరితా!"

ఆ పిలుపు సరిత కాళ్ళకి కళ్ళెంవేసి ఆపివేసింది.

మంత్ర ముగ్ధలా అటునుండి యిటు తిరిగింది.

తనకి రెండడుగుల దూరంలో తలొంచుకుని నిల్చున్న సరిత వైపే చూస్తూ ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు శరత్.

కానీ చెప్పలేక పోతున్నాడు.

ఏం వినవలసి వస్తుందోనని ఊపిరిబిగబట్టుకు నిల్చుంది సరిత.

ఇరువురి నడుమా రెండు క్షణాలు మౌనంగా దొర్లి పోయాయి.

"ఏం లేదు వెళ్ళు." అని స్కూటర్ టర్న్‌చేసుకుని వెళ్ళి పోయాడు శరత్.

అయోమయంగా చూస్తూ నిలబడిపోయిన సరిత 'నిజంగా వింత మనిషే!' అనుకుంది మనసులో.

* * *

క్లాసులో కూర్చుని ఎకనామిక్స్ పాఠం వింటున్న సరితకు వున్నట్టుండి క్రితంరోజు జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది.

"శరత్ యెందుకలా ప్రవర్తించాడు? మొదట తనని అవ మానించినట్లు మాట్లాడినవాడు అంతలోనే యెందుకలా మారి పోయాడు? 'ఓడిపోయాను' అనడంలో అర్ధమేమిటి?"

"సరితా!" అన్న పిలుపు అతని నోటినుండి యెంత తీయగా పలికింది!

ఆ క్షణంలో తను సర్వం మరిచిపోయి ఆ పిలుపులోని మత్తుకు లోబడిపోయింది.

ఏం చెప్పాలనుకున్నాడు? యెందుకు చెప్పలేక పోయాడు?

ఏముంటుంది? తనే మరీ పిచ్చిగా ఆలోచిస్తున్నది.

గోరంతలు కొండంతలుచేసి ఆలోచించడం తనకి మామూలే. అనవసరంగా మతి పోగొట్టుకుంటున్న దంతే.

ఆరోజంతా క్లాసులో స్తబ్దుగా వుండిపోయింది సరిత.

సాయంత్రం బస్సులో ఇంటికి వెళుతుండగా నెహ్రూపార్కు దాటాక రోడ్డు ప్రక్కగా ఊడలు దిగివున్న మర్రి చెట్టును చూడగానే ఇక్కడే నిన్న శరత్ స్కూటర్ పంచరయింది అన్న సంగతి గుర్తు కొచ్చింది. "తను యీ చెట్టుక్రిందే నిలుచుంది. అతని స్కూటర్ వెనుక అదుగో ఆ చెట్టువరకూ పరుగుపెట్టింది. వింత మనిషి, క్షణంలో యెలా మారిపోతాడో తెలీదు—"

"అమ్మాయిగారూ, స్టేజి వచ్చింది." కండక్టరు చెప్పడంతో వులిక్కిపడి చూచి గబగబా బస్సు దిగింది.

రోడ్డు ప్రక్కగా కారు ఆపుకుని నిలబడి వున్నాడు శరత్. చూపి తెల్లబోయింది.

తల దించుకుని అతని ముందునుంచే నడిచి పోబోయింది.

"సరితా!" పిలుస్తూ అతనే సరిత దగ్గర కొచ్చాడు!

"నీకోస అరగంట నుంచీ వెయిట్ చేస్తున్నాను. చూడనట్లు వెళ్ళిపోతున్నావా?"

సరిత తలదించుకుంది.

"అమ్మ ఆరోగ్యం సరిగాలేదు సరితా! స్థలం మార్పుకని నెల రోజులు సెలవుపెట్టి మా ఊరు తీసుకెడుతున్నాను...."

ఆత్మీయులకు చెపుతున్నట్లు చెప్పుకు పోతున్నాడు శరత్. వింటోంది సరిత.

"ట్రయిన్‌కి యిక పావుగంటే టైమ్‌వుంది. వెళ్ళిరానా?".... సరిత ముఖంమీద దృష్టి నిలిపి అన్నాడు.

తనకి చెప్పివెళ్ళడాని కొచ్చాడా? ఆశ్చర్యంనుండి తేరుకో లేక పోయింది సరిత.

అతను కారు వరకూ వెళ్ళి, అంతలోనే మళ్ళీ వెనక్కి తిరిగొచ్చాడు.

"నామీద కోపం వచ్చిందా?" మంద స్వరంతో అడిగాడు. అతనలా మెత్తగా అడిగేసరికి తనకు తెలీకుండానే 'లేదు.' అన్నట్లు తల అడ్డంగా వూపింది.

"థాంక్స్. ఊరినుంచి రాగానే దేవిగారి దర్శనం చేసుకుంటాను. చేతిమీది చొక్కా పైకిలాక్కుని వాచీ చూసుకున్నాడు.

ఒక్క అంగలో వెళ్లి కార్లో కూర్చున్నాడు.

మరు నిముషంలో చూపుకందనంత దూరం వెళ్లిపోయింది కారు. అదే చూస్తూ నిలబడిన సరితకి మనసునిండా అల్లిబిల్లిగా ఏవేవో ఊహలు అల్లుకు పోసాగాయి.

ఏమిటి? తనేమైపోతున్నది? అతని సమక్షంలో, అతని మాటలు వింటూ తనెందుకలా వివశ అయిపోతోంది. శరత్ మనసులో తనకి ప్రత్యేక స్థానంవుంది. అందుకే ట్రయిన్‌కి పావుగంట వ్యవధేవున్నా, తనతో చెప్పివెళ్ళడాని కొచ్చాడు. అనుకునే సరికి సరిత తను మనఃప్రాణాలు పులకించాయి. మధురాలోచనలతో ఇంటి వైపు సాగింది.

*　　*　　*

నెల గడిచింది.

ఆరోజు పార్కు దగ్గరే సరితను కలుసుకున్నాడు శరత్.

"మీ అమ్మగారి కెలావుంది?"

"పరవాలేదు. మునుపటిలా తిరగగలుగుతుంది."

ఇద్దరూ నడిచి వెళ్లి విరగబూసిన నందివర్ధనం చెట్టుక్రింద కూర్చున్నారు.

నెల్లాళ్ళ తరువాత కలుసుకున్న ఇద్దరి మనసులూ చిత్రంగా స్పందించ సాగాయి.

కొద్దిసేపు యిరువురి మధ్య మౌనం రాజ్యమేలింది.

"సరితా! నిన్నోమాట అడుగుతాను. నిజం చెపుతావా?"

"ఊఁ!"

"ఈ నెల్లాళ్ళల్లో ఒక్కసారైనా నేను గుర్తు కొచ్చానా?"

"........"

"చెప్పు సరితా!"

సిగ్గుతో రాగరంజితమైన ఆమె ముఖాన్ని చూసి నవ్వుకున్నాడు శరత్.

"సరితా! యీ రోజు నా మనసంతా విప్పి నీ ముందుంచాలని వుంది—"

"ఈ నెల్లాళ్ళూ నీకు దూరంగా వుండటంవలన, నా మనసేమిటో నా కర్థమయింది. ఆ రోజు మొదటిసారిగా నిన్ను ఆడిటోరియమ్‌లో చూసిననాడే నాలో యేదో అలజడి ప్రారంభమయింది. నీతో స్నేహం చేయాలని నా మనసు తహ తహ లాడింది. మధ్యలో నీమీద అపరిమితమైన కోపంవచ్చి నిన్ను కన్నెత్తయినా చూడకూడదని నిశ్చయించుకున్నాను. అంతేకాదు. బాగా యేడిపించి బుద్ధిచెప్పాలనుకున్నాను కూడా కానీ, నేనే ఓడిపోయాను.

ఆ రోజు నువ్వు, నా పేరుపెట్టి పిలిచావు చూడు....నాకేమనిపించిందో తెలుసా?—నీ చేతి స్పర్శ, నీ పిలుపు నేను గుర్తించాననీ, మన బంధం యీనాటిది కాదనీ....యీ విషయం ఆ రోజే చెప్పాలనుకున్నాను. కానీ, చెప్పకపోవడమే మంచిదయింది. చెప్పుంటే నన్నో పిచ్చివాడిగా జమకట్టేసేదానివి కదూ!—"

అతనలా మనసువిప్పి మాట్లాడుతూంటే సరిత మనసుకి ఎంతో హాయి అనిపించింది. చెప్పలేనంత సంతోషం కలిగింది. ఇన్నాళ్ళుబట్టీ మనసులోవున్న శంకలన్నీ దూదిపింజల్లా గాలికి కొట్టుకుపోయాయి. ఆ సమయంలో అతనెంతో సన్నిహితుడిగా అనుపించాడు. 'ముక్కుమీద కోపమైనా కపటమెరుగని మనసు' అనుకుంది. అంతలో 'పిచ్చివాడిగా జమకట్టేదానివి కదూ?' అని అతనడిగిన ప్రశ్న గుర్తుకొచ్చి నవ్వొచ్చి చిలిపిగా నవ్వింది.

పచ్చగడ్డి మీదవున్న సరిత చేతిమీద చేయివేసి మృదువుగా నొక్కాడు శరత్.

కళ్ళెత్తి చూచింది సరిత.

"ఐ లవ్ యూ సరితా!" మందస్వరంతో సరిత కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

చప్పున చేయి లాక్కుని లేచి నిలుచుంది.

పుస్తకాల బేగ్ చేత్తో పట్టుకుని గాలిలోకి వూపుతూ చూపించాడు శరత్.

ఇవ్వమని చేయి చాపింది సరిత.

బేగ్ వున్న చేయి వెనక్కి పెట్టుకుని ఇవ్వనని తల అడ్డంగా వూపాడు శరత్.

"సరితా!"—వెళ్ళిపోతున్న సరితను పిలిచాడు.

సరిత ఆగలేదు. సాగిపోతూనే వుంది.

సరితను సమీపించి, ఆమె వెనుకే నిల్చుని బేగ్‌వున్న చేతిని ముందుకు పోనిచ్చాడు.

బేగ్ అందుకుని బుజానికి తగిలించుకుంటూ ఒక్క ఉదుటున పరుగు తీసింది.

"సరితా!" కంగారుగా పిలిచాడు.

వెనక్కి తిరిగైనా చూడకుండా పరుగునవెళ్ళి కదులుతున్న బస్సు ఎక్కేసింది సరిత.

* * *

సరిత బి.ఎ. సెకండియర్‌లో కొచ్చింది. ఒక్కరోజు చూసుకోకపోయినా, కలిసి మాట్లాడుకోకపోయినా వుండలేని స్థితికొచ్చేసారు సరితా, శరత్‌లు.

ఓ పెద్ద భవన ప్రాంగణంలో కారాగడం చూచి చక్రాలవంటి కళ్ళతో చిత్రంగా ఆ భవనాన్ని చూస్తూ "ఎక్కడికొచ్చాం?" అడిగింది సరిత.

"చూద్దువుగాని రా!" అంటూ సరిత చేయిపుచ్చుకుని లోపలికి దారితీసాడు శరత్.

విశాలమైన హాలులోకి అడుగుపెట్టారు.

సోఫాలో కూర్చుని ఏదో లావుపాటి పుస్తకం ఒళ్ళో పెట్టుకుని చదవడంలో నిమగ్నమైన నడివయసామెను చూచిన సరిత చప్పున చేయి విడిపించుకుని శరత్‌కి యెడంగా జరిగి నిలబడింది.

పదధ్వనికి ఆమె తలెత్తి చూచింది.

"రామ్మా! సరితా!" ఆప్యాయంగా పిలిచింది.

చేతులు జోడించి నమస్కరించింది సరిత.

అడుగులో అడుగువేసుకుంటూ వెళ్ళిఆమెప్రక్కన నిలబడింది.

ఆమె చేయిసాచి, సరిత చేతిని అందుకుని ప్రక్కన కూర్చో పెట్టుకుంది.

కంటి కొసలతో ఆమె వొడిలోని పుస్తకాన్ని చూచింది.

రామాయణగ్రంథం.

కొద్దిగా తలెత్తి గదినంతా కళ్ళతోనే కలయచూచింది.

ఎక్కడో దేవలోకంలోకి అడుగుపెట్టినట్లు భ్రమకలిగింది సరితకు.

"ఏం చదువుతున్నావు?" ప్రేమగా పలకరించింది అరుణా దేవి.

"బి.ఎ సెకండియర్."

"బాగా పాడతావటగా!" నవ్వుతూ ఆమె అడిగినదానికి సిగ్గు పడుతూ తల దించుకుంది సరిత.

"ఈసారి వచ్చినప్పుడు నీపాట వినిపించాలి."

ఎంత సంస్కారంగల స్త్రీ! ఇప్పుడే పాడు, వింటాను అంటే చస్తే తనగొంతు పెగిలేదికాదు. ఆమె మాటల్లో మళ్ళీ తనని రమ్మన్న పిలుపు కూడా వుంది.

శరత్ మాగజైన్ ముఖానికి అడ్డం పెట్టుకుని అప్పుడప్పుడు సరితని గమనిస్తూ కూర్చున్నాడు.

నౌకరు ఫలహారం ప్లేట్లు ట్రేలో అమర్చి తెచ్చాడు.

అరుణాదేవి బలవంతమీద సరిత సిగ్గుపడుతూ తింది.

"నేను ఎక్కువ తిరగలేనమ్మా! శరత్‌వెంట వెళ్ళి ఇల్లు చూసిరా!" అంది అరుణాదేవి.

శరత్ లేచి నిలుచున్నాడు. సరిత, అతని వెనుక వెళ్ళింది.

గదిలో అడుగుపెడుతూనే ఒక్క వుదుటున సరిత బుజాలు పట్టుకుని తన కభిముఖంగా తిప్పుకున్నాడు శరత్.

"అమ్మదగ్గర అంత కుదురుగా మాట్లాడావే, మరి నాతో యెందుకంత 'ఇది'గా మాట్లాడతావు" సూటిగా చూస్తూ అడిగాడు.

సరిత చూపుల్లో బెదురుపోయి ఆ స్థానంలో చిలిపితనం చోటు చేసుకుంది.

తన భుజం మీదున్న శరత్ చేతులు తీసేయడానికి ప్రయత్నించింది.

"ఊఁ త్వరగా చెప్పు" అతని చేతులు సరిత భుజాలని మరింత బలంగా నొక్కి పట్టాయి.

"ఏం చెప్పను?"

"నాతో యెందుకంత మొండితనంగా మాట్లాడుతావో!—"

"చెప్పనా?"

"ఊఁ"

"చెప్పను."

"చెప్పవూ?—కోపంతో సరిత బుజాల్ని వదిలేశాడు.

గదిని పరిశీలించడానికని అటు తిరిగింది సరిత.

అటుతిరిగి నిల్చున్న సరితను ముందుకు పోనీయకుండా వెనుకనుంచి రెండు చేతులతో బంధించాడు శరత్.

సరిత భుజంమీద గడ్డాన్ని ఆనించి "ఇప్పుడు చెపుతావా?" మందస్వరంతో అడిగాడు.

అతని చేతులనుండి విడిపించుకోవాలని ప్రయత్నిస్తూ హఠాత్తుగా యెదురుగా కనిపించిన దృశ్యంచూచి చేష్టలుదక్కి బొమ్మలా నిలబడిపోయింది సరిత.

గోడలో బిగించివున్న నిలువెత్తు అద్దంలో సినిమా పోస్టర్ లాగా తమ ప్రతిబింబం కనిపిస్తోంది.

శరత్ వక్షస్థలాన్ని ఆనుకుని, అతని రెండు చేతులమధ్య బందీలా నిలబడివుంది సరిత.

విడిపించుకోడానికని పట్టుకున్న సరిత చేతులు అతని చేతులను పెనవేసుకునున్నాయి.

అద్దంలోని సరిత ప్రతిబింబాన్ని చూచి నవ్వాడు శరత్.

సరిత తల దించుకుంది.

శరత్ ఆమె నలాగే తన కభిముఖంగా తిప్పుకున్నాడు.

గడ్డం పైకెత్తి పట్టుకుని "సరితా!" మృదుమధురంగా మందస్వరంతో పిలిచాడు.

ఆ క్షణాన సరిత హృదయం చిత్రంగా స్పందించ సాగింది. కళ్ళెత్తి చూడలేక రెప్పలు వాల్చుకుంది.

"సరితా!" పరవశంగా ఆమెను హృదయానికి హత్తుకున్నాడు శరత్.

ఆ పారవశ్యంనుండి, ఆ మైకంనుండి బయట పడటానికి సరితకి క్షణకాలం పట్టింది.

అతని చేతులనుండి విడిపించుకుని దూరంగా జరిగి నిలబడింది.

శరత్ నిర్నిమేష దృష్టితో సరితనే చూస్తున్నాడు.

తలెత్తి చూచిన సరిత "ఉండండి. మీ అమ్మగారికి చెప్తాను" అన్నది, గొంతులో బెదిరింపునీ, కళ్ళల్లో సిగ్గునీ నింపుకుని.

"ఏమనీ?"

"విందురుగాని, రండి."

అడుగు ముందుకువేసిన, సరిత రెక్క పుచ్చుకుని ఆపి, "నువ్వు చెప్పింది విన్నాక అమ్మేం చేస్తుందో తెలుసా?"

"అబ్బాయిగారి పెళ్ళి!" వెక్కిరింపుగా అంది.

"అందుకు అమ్మాయిగారు సిద్ధమేనా?" సరిత కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

ఒక్క విదిలింపుతో చేయి విడిపించుకు ప్రక్కగదిలోకి పరుగుతీసింది సరిత.

తర్వాత అతనివెంట యిల్లంతా తిరిగిచూపి చివరికి అరుణాదేవి వున్న హాల్లోకి చేరుకుంది.

ఆవిడ దగ్గర శెలవుతీసుకుని శరత్ వెనుక బయిటికి నడిచింది సరిత.

దారి పొడవునా శరత్ మాట్లాడిస్తున్నా మౌనంగా వుండిపోయింది.

* * *

"సరితా! యేమిటీ మౌనం? ఇంకా ఆస్థులు, అంతస్తుల గురించే ఆలోచిస్తున్నావా?" సరితకి కాస్త దూరంలో కూర్చుంటూ అడిగాడు శరత్.

సరిత కొద్దిసేపు వూరుకుని జవాబిచ్చింది. "మాది సామాన్యమైన కుటుంబం. నాన్న హెడ్‌మాస్టరుగా రిటారయ్యారు. శివరాం పల్లిలో చిన్న పెంకుటిల్లు తప్ప మాకు ఆస్తి, పాస్తులులేవు. నాన్నకి మేం ఇద్దరం ఆడపిల్లలం. ఉన్నంతలో మమ్మల్ని గారంగానే పెంచారు. అక్క, బి.ఎ పూర్తిచేసింది. నాన్న ప్రావిడెన్ట్‌ఫన్డు, ఇన్సూరెన్స్ కలిపితే అక్కపెళ్ళి చేయగలరు. ఆ తరువాత యిల్లు తప్ప ఏదీ మిగల్దు."

"ఇదంతా నిన్నెవరడిగారు?" అసహనంగా అడిగాడు.

"మీరు అడిగారనికాదు. కానీ, మా పరిస్థితి యేమిటో మీకు తెలియాలిగా! వియ్యానికైనా, కయ్యానికైనా సమవుజ్జీ కావాలంటారు. వెనకా, ముందూ ఆలోచించకుండా మీతో స్నేహంచేసాను" చివరిమాటలు తనలో తను అనుకుంటున్నట్లు మెల్లగా అన్నది.

క్షణకాలం సరిత ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు శరత్.

"ఇప్పుడయినా మించిపోలేదుగా! మీస్థితికి, ఉజ్జీకి తూగేవాడినే చూపి చేసుకో. నాకేం అభ్యంతరంలేదు" చివాల్న లేచి నించున్నాడు.

"శరత్!...."

"ఒక చిన్న రిక్వెస్ట్. నీ పెళ్ళికి శుభలేఖ పంపడం మాత్రం మర్చిపోకు."

గిరుక్కున వెనక్కితిరిగి వెళ్ళిపోబోతున్న శరత్ చేయి పట్టుకుని ఆపింది సరిత.

అతను తిరిగి చూశాడు.

వర్షించడానికి సిద్ధంగా వున్నాయ్ సరిత కళ్ళు.

శరత్ మనసు వశం తప్పింది. అయినా బెట్టు నటిస్తూ అన్నాడు.

"అసలు నీకీ ఆలోచనెందుకొచ్చింది! ఎప్పుడయినా నీతో భేదంగా ప్రవర్తించానా?"

"లేదు."

"మరెందు కంత పిచ్చిగా ఆలోచిస్తున్నావు?"

సరిత మాట్లాడలేదు.

"ఇంకెప్పుడూ మన మధ్య యిటువంటి మాటలు రానీయనని ప్రామిస్ చెయ్యి" చేయి చాపాడు.

"అదికాదు శరత్!"__యేదో చెప్పబోయింది.

"ఇంకేదీ నేను వినదల్చుకోలేదు. ముందు ప్రామిస్ చెయ్యి. లేకపోతే యిదే మన ఆఖరి కలయిక అవుతుంది."

సరిత మరేమీ ఆలోచించకుండా అతని చేతిలో చేయివేసింది.

"ఈ రోజు నీకో గుడ్ న్యూస్ చెప్పాలని వచ్చాను. కానీ, నా మూడ్ పాడుచేసావు" అంటూ సరిత ప్రక్కనే కూర్చున్నాడు.

"ఏమిటది?"

"చెప్పను."

చివరికి సరితచేత బ్రతిమాలించుకుని చెప్పాడు.

"పి. హెచ్‌డి చేయడానికి అమెరికా వెడుతున్నాను" అని.

"నిజంగా!" సంభ్రమాశ్చర్యాలతో చూసింది.

" నా ప్లానేమిటో తెలుసా?"

"తమరు సెలవీయండే!"

సరిత చేతిని తన చేతుల్లోకి తీసుకుని ఆమె సన్నటి పొడవాటి చూపుడువేలు మడుస్తూ "మొట్టమొదటిది మనపెళ్ళి" అంటూ సరిత మొహంలోకి చూశాడు.

అతనివైపే చూస్తున్న సరిత కళ్ళు రెపరెపలాడి వాలిపోయాయి.

"రెండవది. నేను వెళ్ళగానే నీకు వీసాకోసం ప్రయత్నించడం."

"మూడు. మనం లేని సమయంలో ఇక్కడ అమ్మకి ఏ యిబ్బందీ కలగకుండా వుండే యేర్పాటుచేయడం."

"సారీ, సార్! మీ ప్లానులో మొదటి రెండూ కాన్సిల్ చేసుకోవలసి వుంటుంది."

శరత్ ఉలికిపాటుగా సరిత ముఖంలోకి చూశాడు.

"నా చదువు పూర్తికాలేదు. అక్కకి పెళ్ళికాలేదు.

"మన పెళ్ళిచేయమని ఎలా అడగను?"

"నువ్వడగడం దేనికి? నేనే అడుగుతాను."

"బాగుంది. నేనడిగినా, మీతో అడిగించినా తేడా ఏముంది? అయినా అక్కపెళ్ళి కానిదే మనపెళ్ళి జరగదు."

అంతలోనే సరిత స్వరం గంభీరంగా మారిపోయింది.

"ఇంట్లో పెద్దపిల్ల పెళ్ళికానిదే రెండోపిల్లకి పెళ్ళి అయిందీ అంటే, ఇక జన్మలో ఆ పిల్ల పెళ్ళి జరగదు. ఏ లోపం వుందో అందుకే జరగలేదని నిందమోపుతుంది లోకం. కాబట్టి మీరు డాక్టరేట్ పూర్తిచేసుకుని రండి. ఈ లోగా అక్కపెళ్ళి జరిగి పోతుంది. నా చదువూ పూర్తవుతుంది. అప్పుడు....సరిత మీకోసం చకోరిలా యెదురు చూస్తూవుంటుంది."

శరత్ మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"వియోగంలో కూడా ఆనందం వుంటుందంటారు. దూరంగా వున్నప్పుడే బంధాలు, బాంధవ్యాలు గట్టిపడేది."

లేచి నిలుచుంది సరిత.

"నువ్వుండగలవేమోగానీ, నావల్ల కాదు." లేస్తూ విసుగ్గా అన్నాడు.

శరత్ ప్రక్కన నడుస్తూ అతనికి ఎన్నో విధాల నచ్చ జెప్పటానికి ప్రయత్నించింది సరిత.

ఇద్దరూ రోడ్డుమీది కొచ్చాక విడిపోయారు.

* * *

రోజులు త్వరత్వరగా గడిచిపోతున్నాయి.

శరత్ వెళ్ళవలసిన రోజు దగ్గరకొచ్చింది.

రేపు ప్రయాణమనగా, ఆ ముందురోజు సరితను స్కూటరెక్కించుకుని ఎప్పుడూ కలుసుకునే చోటకు తీసుకుపోయాడు శరత్.

ఉదయం పదిగంటలు దాటింది.

పొగడచెట్టు క్రింద పూలు వొత్తుగా రాలిపడుతున్నాయి.

సరిత చేయిపట్టుకుని ఆ పూల మీదినుంచి నడుస్తూ చెట్టుక్రింద కొచ్చి ఆగాడు శరత్.

చెట్టుక్రింద తను కూర్చుని, సరిత చేతినందుకుని ప్రక్కనే కూర్చోపెట్టుకున్నాడు.

మౌత్ఆర్గన్ మీద సరిత కిష్టమైన పాట వాయించాడు. వాయిద్యం ఆగింది. సరిత చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"సరితా?" గుండెల్ని చీల్చుకుని వచ్చిందా పిలుపు.

అప్పటివరకూ పెదాల బిగిని ఆపుకుంటున్న దుఃఖాన్ని యిక ఆపుకోలేకపోయింది సరిత.

అతని యెదమీద వాలి వెక్కి వెక్కి యేడ్వసాగింది.

సరితని హృదయానికి హత్తుకున్నాడు.

మూసుకున్న శరత్ కళ్ళనుండి కన్నీళ్ళు ధారకట్టాయి.

క్షణాలు....నిమిషాలు గడిచిపోతున్నాయి.

వాళ్ళిద్దరికీ కాలం స్థంభించిపోయింది.

గాలికి ఆకుల సందులనుండి జలజలా రాలిన పూలు ఆ జంటపై పడి ఆశీర్వదిస్తున్నాయి.

శరత్ ముందుగా తేరుకున్నాడు.

"వియోగంలో కూడా ఆనందముంది మేడమ్. దూరంగా వున్నప్పుడే బంధాలు, బాంధవ్యాలూ గట్టిపడేది" సరితని నవ్వించడానికని అన్నాడు.

ఆ రోజు తనన్న మాటలే అతనంటుంటే చురచురా చూసింది సరిత.

"పోనీ యిప్పుడయినా చెప్పు. వీసా కోసం ప్రయత్నించనా?"

'వద్దు' అన్నట్లు తల అడ్డంగా వూపింది.

"అంతమాత్రానికి ఏడవడం దేనికో!"

"నేనేం యేడ్వలేదు."

"ఏదీ చూడనీ....ఆ కళ్ళు" చప్పున సరిత ముఖాన్ని రెండు చేతుల మధ్యకి తీసుకున్నాడు.

కొలనులో చేపపిల్లలా తళతళ లాడుతున్న ఆ కళ్ళల్లోకి చూస్తూ "సరితా! మళ్ళీ మనం యిలా కలుసుకునే దెప్పుడో!" అంటూ ముందుకు వొంగి సరిత నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు.

"మనసంగతి మీయింట్లో తెలీదేమో! ఒకవేళ మీవాళ్ళు వేరే సంబంధం చూసి___"

అతని నోటిని తన చేత్తో మూస్తూ "అలా అనొద్దు శరత్! నేను, మీదాన్ని. మీకోసం మూడేళ్ళు కాదు. మూడు యుగాలైనా ఎదురుచూస్తూ వుంటాను" ఆవేశంగా అంది.

"నా ప్రతీఉత్తరానికీ జవాబివ్వాలి"అని ప్రామిస్ తీసుకున్నాడు.

"ఒక షరతు. మీ యింటి ఎడ్రసుకే వ్రాయాలి" అంది సరిత.

సాయంత్రం వరకూ___ఆ తోటలో కబుర్లతోనే గడిచిపోయిందా జంటకు.

* * *

"రామ్మా! సరితా!" ఆప్యాయంగా ఆహ్వానించింది అరుణాదేవి. తన ప్రక్కనే సోఫాలో కూర్చోపెట్టుకుంది. "నీకోసమే ఎదురుచూస్తున్నానమ్మా! నిన్ననే శరత్ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది."

లేచి వెళ్ళి ఉత్తరంతో తిరిగి వచ్చింది.

ఆమె చేతుల్లోంచి ఎయిర్ మేల్ అందుకుంటున్న సరిత వేళ్ళు సన్నగా వణికాయి.

ఏదో పని వున్నట్లు లోపలికి వెళ్ళింది అరుణాదేవి.

సరిత గబగబా లెటర్ విప్పింది.

ముత్యాలు పేర్చినట్లుగా వున్న పంక్తులవెంట సరిత కళ్ళు పరుగులు పెట్టాయి.

గుండె ఝల్లుమంది....బుగ్గల్లోకి రక్తం చివ్వున పొంగుకొచ్చింది....సిగ్గుతో ముఖం ఎర్రబడింది. వుత్తరం చదువుతున్నంతసేపూ రకరకాల భావాలతో సరిత హృదయం వుక్కిరి బిక్కిరి ఐపోయింది. కొన్ని వేలమైళ్ళు దాటుకుని శరత్ దగ్గరకు ప్రయాణమై వెళ్ళిపోయింది. అడుగుల చప్పుడు విని వుత్తరాన్ని మడిచేసి బుద్ధిగా కూర్చుంది.

అరుణాదేవి వెనుక వచ్చిన నౌకరు పలహారాలతో నిండిన ట్రే టేబులుమీద పెట్టి వెళ్లాడు.

అరుణాదేవి బలవంతం చేయగా రెండుప్లేట్లు ఖాళీ చేసింది

సరిత.

కాస్సేపు కుశలప్రశ్నలు అయ్యాక "శరత్ నీకు యివ్వ మన్నాడు" అంటూ ఓ అట్టపెట్టె అందించింది అరుణాదేవి.

అందుకుని మూతతీసి చూసిన సరితకళ్ళు సిగ్గుతో వాలిపోయాయి.

అందులో శరత్ వచ్చేవరకూ వ్రాయడానికి సరిపడేన్ని ఎయిర్ మేల్స్ వున్నాయి.

* * *

కాలగర్భంలో రెండు సం॥రాలు దొర్లిపోయాయి.

"నాలుగు ఉత్తరాలు వ్రాసినా సరితనుండి జవాబులు లేవు. కారణం తెలిస్తే వ్రాయమ్మా!"

శరత్ దగ్గరనుంచి వచ్చిన ఉత్తరానికి ఏం సమాధానం వ్రాయాలో అరుణాదేవికి తోచలేదు.

"సరిత యెందుకు రావడంలేదో! బహుశా వాళ్ళింట్లో ఎవరికైనా సుస్తీ చేసుంటుంది" అనుకుని అంత దూరంలోవున్న కొడుకు మనసు నొప్పించడం యిష్టంలేక తనూహించిన కారణమే వ్రాసింది.

మరో నెల గడిచింది.

"అమ్మా! సరిత అభిమానస్తురాలు. నోరు తెరిచి అడగదు. నువ్వే సహాయం చెయ్యి."

మరో ఉత్తరం వచ్చింది అరుణాదేవికి.

తోచినట్లుగా జవాబిచ్చింది గానీ ఆమె, సరిత గురించే ఆలోచనలో పడింది.

శరత్ దగ్గర నుండి సరితకీ, అరుణాదేవికి విడివిడిగా ఉత్తరాలు వస్తూనే వున్నాయి.

సరిత ఎడ్రసు ఆవిడకు తెలీదు. శరత్‌కి వ్రాస్తే తను పట్టుబడిపోతుంది. 'సరే. చూద్దాం. రాకపోదు.' అని వూరుకుంది.

ఆరుమాసాలు గడిచాయి.

సరిత జాడలేదు. హఠాత్తుగా సరిత మిత్రురాలి ద్వారా సరితకు

పెళ్ళైపోయిన సంగతి తెలిపి నిశ్చేష్టురాలయింది అరుణాదేవి.

"సరిత పెళ్ళి చేసుకుందా? సరిత అటువంటిదా?" నమ్మశక్యం కాకుండా వుంది అరుణాదేవికి.

శరత్ ఉత్తరానికి సమాధానంగా-'సరిత అక్క పోయిందట. ఆ విచారంలో వుండి వ్రాయలేక పోతోంది. కొద్దిగా తేరుకున్నాక తనే వ్రాస్తుంది.' అని మాత్రం వ్రాసింది.

శరత్‌కి యీ విషయం తెలిస్తే తట్టుకోగలడా? ఈ ఆలోచనే ఆమెని వేధిస్తోంది.

* * *

కాళ్ళకు నమస్కరిస్తున్న కొడుకుని ఆప్యాయంగా లేవనెత్తింది అరుణాదేవి.

పొడవుగా, బక్కపలచగా వుండే శరత్ కాస్త ఒళ్ళుచేశాడు. అతని శరీరఛాయ మరింత పసిమిరంగుకు మారింది.

కొడుకుని కళ్ళనిండుగా తృప్తిగా చూసుకుంది అరుణాదేవి.

"ఏమ్మా! ఆరోగ్యం సరిగ్గా లేదా? చాలా చిక్కిపోయావు." తల్లిని పరిశీలనగా చూస్తూ అడిగాడు శరత్.

ఆమె అదేం పట్టించుకోకుండా "అలిసిపోయొచ్చావు. కాస్సేపు విశ్రాంతి తీసుకో." అని ఏదో పనున్నట్లు లోపలికి వెళ్ళబోతూంటే "అమ్మా! నేనొస్తున్నట్లు సరితకి తెలుసా?" అడిగాడు శరత్.

ఉలిక్కిపడింది అరుణాదేవి. వినిపించుకోనట్లు గబగబా లోపలికి వెళ్ళిపోయింది.

తల్లి ప్రవర్తనకు విస్తుపోయాడు శరత్. కాస్సేపు అలాగే నిలబడిపోయాడు. చివరికి వినివుండదు అని సరిపెట్టుకున్నాడు.

అరగంట తర్వాత రెయిన్‌కోట్ గుండీలు పెట్టుకుంటూ క్రిందికి దిగొస్తున్న కొడుకుని చూసి, ఆమె గుండెల్లో రాయిపడింది.

'సరితకోసం వెడుతున్నాడు. తన నోటితో చెప్పలేదు. అయినా నిజం తేలిపోతుంది.' అనుకుంది.

"ఇప్పుడేగా వచ్చావు. కాస్సేపయినా కూర్చుని కబుర్లు చెప్పకుండా అప్పుడే ఎక్కడికి? వర్షం పెద్దదయ్యేలా వుందికూడాను."

నిష్ఠూరంగా తల్లి అంటున్న మాటల కడ్డొచ్చి "ప్లీజ్! పది నిముషాల్లో వచ్చేస్తానమ్మా! ఆలస్యం చెయ్యను." చిన్నపిల్లవాడిలా బ్రతిమాలుకుని హుషారుగా వెడుతున్న కొడుకుని చూసి గాఢంగా నిట్టూర్చింది అరుణాదేవి.

సన్నగా కురుస్తున్న వానజల్లులో రయ్‌న దూసుకుపోతున్నది శరత్ స్కూటర్. ఆహ్లాదకరమైన వాతావరణంలో పల్టీలు కొడుతున్న విహంగంలా వుంది అతని మనసు.

తను సరితను చూడబోతున్నాడు. తనను చూడగానే సుడి గాలిలా వచ్చి చుట్టేస్తుంది సరిత. తన కౌగిలిలో వొదిగిపోయి అక్కగారు పోయిందన్న దుఃఖమంతా మర్చిపోతుంది.

ఇంటిముందు స్కూటర్ ఆపి తలుపుకొట్టాడు శరత్.

రెండు నిముషాల తరువాత కొద్దిగా తలుపు తెరిచి పట్టుకుని తొంగిచూశారు శివరామయ్యగారు.

రెయిన్ కోటుతో, తలమీద టోపీతో గుమ్మంలో నిల్చున్న వ్యక్తి యెవరో పోల్చుకోలేకపోయారు.

"ఎవరు బాబూ? ఎవరు కావాలి?" అడిగారు.

సరితే వచ్చి తలుపు తీస్తుందనుకున్న శరత్ నిరుత్సాహపడి పోతూ "సరితను పిలవండి." అన్నాడు.

"లేదు బాబూ!"

"ఎక్కడికి వెళ్ళింది?"

"మద్రాసులో వుంటున్నది."

"మద్రాసులోనా? అక్కడెందుకుంటున్నది? ఎప్పుడొస్తుంది?" ఆత్రుతగా అడిగాడు.

సరిత పెళ్ళి విషయం చెప్పాడు శివరామయ్య.

నెత్తిమీద పిడుగుపడ్డట్లయింది శరత్‌కి. క్తొయ్యబారిపోయాడు. "నో. నేను నమ్మను. అంతా వట్టిది నిజం చెప్పండి."

"ఒక్కమాట చెప్పండి. తనే ఒప్పుకుందా? మీరు బలవంతంగా చేసారా? తలుపు సందులోంచి శివరామయ్యను చూస్తూ అడిగాడు.

"ఇందులో బలవంతం ఏముంది? అమ్మాయి యిష్టంమీదే

పెళ్ళి జరిగింది. పెళ్ళయి ఆర్నెలయింది కూడాను. ఇంతకీ నువ్వు—"

గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళి స్కూటర్ స్టార్ట్ చేశాడు.

అయోమయంగా చూస్తూ నిలబడిపోయాడు శివరామయ్య.

* * *

శరత్ చాలా మారిపోయాడు. అవసరమనుకుంటే తప్ప ఎవరితోనూ మాట్లాడడు. చివరికి తల్లిని కూడా తప్పించుకుని తిరుగుతున్నాడు. గదిలో ఒంటరిగా కూర్చోడం విసుగనిపించి ఆ రోజు తోటకి వెళ్ళాడు.

ఒత్తుగా రాలిపడున్న పొగడపూలమీద తలక్రింద చేతులు పెట్టుకుని పడుకుంటే సరిత జ్ఞాపకాలే.

ఒకప్పుడు ఈ తోటంతా తమ నవ్వులతో, పాటలతో ప్రతిధ్వనించేది.... ఈ చెట్టుక్రింద చెట్టాపట్టా లేసుకుని తిరిగారు. పచ్చగడ్డిలో కూర్చుని గంటలకొద్దీ కబుర్లు చెప్పుకున్నారు. అనుకుంటే కడుపులో నుంచి దావానలంలా వస్తుంది మంట.

సరిత తనతో తిరగడం, పాడడం అన్నీ నటనేనా?

మోసం. దగా. తనేమో హాయిగా అతనితో కులుకుతూ వుంటుంది. తనే మర్చిపోలేకపోతున్నాడు. ఛీ ఛీ! ఆడదాన్ని నమ్మడం మహాపాపం.

అతని మనసేమిటో అతనికే తెలియకుండా వుంది.

గతం గుర్తుకొచ్చి శరత్ మనసంతా బాధతో మెలితిరిగి పోయింది. ఇక ఆలోచించలేకపోయాడు.

* * *

మధ్యాహ్నం రెండుగంటలయింది.

రవిచంద్ర స్కూలునుంచి యింకా రాలేదు. పాప సరిత గదిలో పడుకుని నిద్రపోతున్నది. ఆ రోజు వంటమనిషి రాలేదు.

వరండాలో కూర్చుని ఏవో పాతపుస్తకాలు తిరగేస్తున్న రంగన్నకు ఏదో పని పురమాయించి బయటికి పంపేశాడు శరత్.

సుడిగాలిలా దూసుకొచ్చి ఎదురుగా నిలబడిన శరత్‌ని చూసి దిగ్గునలేచి నిలుచుంది సరిత.

చేతిలోవున్న సీడిల్సు, ఊలు జారి నేలమీద పడిపోయాయి. అక్కణ్ణించి వెళ్ళిపోవాలనే ప్రయత్నంలో అడుగు ముందుకువేసింది.

"పారిపోతున్నావేం? ఆగు" కర్కశంగా అన్నాడు.

దోషిలా అతనికెదురుగా తల దించుకుని నిలబడిపోయింది.

"నేనెవరో తెలుసా? పోనీ—గుర్తుపట్టగలవా?"

"..............."

"చెప్పు. ఎందుకిలా చేశావ్? పెళ్ళి చేసుకోవాలని ఉద్దేశం లేనిదానివి, నా వెంట ఎందుకు తిరిగావు? నీ చుట్టూ నన్నెందుకు తిప్పుకున్నావు? నాకు సమాధానం కావాలి. మాట్లాడవేం?"

సరిత కళ్ళల్లో నీరు చిప్పిల్లింది.

ఏం చెప్తుంది తను?

"నిన్నే ఆరాధిస్తూ. నీమీదే ఆశలు పెంచుకున్న నన్ను నిలువునా మోసం చేసావు, అక్క పెళ్ళి, చదువు అంటూ మాయ మాటలుచెప్పి, నన్ను దూరంగా తరిమేశావు.

స్టేట్సులోవున్న మూడేళ్ళూ మూడు యుగాల్లా గడిపి నీ కోసం నీ మీద పెట్టెడు ఆశతో పరుగెత్తుకొచ్చిన నన్ను అగాధం లోకి తోసేసి నువ్వు హాయిగా సంసారం చేస్తున్నావు" ఆవేదనతో, ఆవేశంతో అతని గొంతు జీరబోయింది.

వాంచిన తల ఎత్తలేదు సరిత. నేలలో పాతిన రాటలా కదులూ మెదులూ లేకుండా నిలబడేవుంది.

"మూడు యుగాలైనా ఆగుతానన్నావే! మూడేళ్ళు ఆగలేక పోయావు. నువ్వు చెప్పకపోయినా ఎందుకో నాకు తెలుసు" సరితకి బాగా సమీపానికెళ్ళి విల్సుని "కరుణాకర్ నా కన్నా డబ్బుగలవాడు. అందగాడు. ఆర్మీ ఆఫీసర్. ఔనా" అన్నాడు.

సరిత సజీవశిలే అయింది.

"ఛీ! నువ్వు మనిషివి కాదు. నీకసలు మనసన్నది లేదు. నీ మాటలన్నీ బూటకాలు. నీదంతా నటన. నమ్మించి మోసంచేసిన ద్రోహివి నువ్వు. నా బ్రతుకులో నిప్పులుపోసిన రాక్షసివి. నన్ను పిచ్చివాణ్ణిగా మార్చిన కసాయిదానివి. నీ ముఖం చూడచూడదు."

విసురుగా గదిలోంచి వెళ్ళిపోయాడు శరత్.

గదిలో పచార్లుచేస్తున్న శరత్ మనసు కుతకుత ఉడికి పోతున్నది. సరితమీద ప్రతీకారం తీర్చుకోడానికి అతని హృదయం ఆరాటపడుతోంది.

చకచక మెట్లెక్కి కరుణాకర్ గదిలోకి వెళ్ళాడు.

లెటర్‌పేడ్ మీద గబగబా రెండు ముక్కలు వ్రాసి ఆ కాగితాన్ని పర్రున చించి పేపర్‌వెయిట్ క్రింద పెట్టాడు.

తన గదిలోకొచ్చి, సూట్‌కేస్ చేత్తోపట్టుకుని ఆ యింటి ఆవరణ దాటాడు.

*　　　*　　　*

'శరత్ వెళ్ళిపోయాడన్న వార్త విని ఆశ్చర్యపోయాడు కరుణాకర్.

"కరుణా! నీ దగ్గర కొన్నాళ్ళుండాలని వచ్చాను" అన్న శరత్ యింత అకస్మాత్తుగా ఎందుకు వెళ్ళిపోయాడు?

ఆలోచిస్తూ మెట్లెక్కి గదిలోకి వెళ్ళాడు.

పేపర్‌వెయిటు క్రింద రెపరెపలాడుతున్న కాగితాన్ని చూసి, తీసి చదివాడు ఆతురతగా.

డియర్ కరుణా!

ఈ విషయం నీ దగ్గర దాచాలనే అనుకున్నాను. కానీ స్నేహ ధర్మం నన్నలా చేయనీయలేదు. నువ్వు మోసపోయావు. నీ రెండవభార్య వట్టి నీచురాలు. ఆవిడ మా కాలేజీలోనే చదివింది. ఆమె గురించి ఎన్నో విన్నాను. కళ్ళారా చూశాను. అటువంటి స్త్రీ నీకు భార్య అంటే సహించలేకపోతున్నాను. ఇంట్లో వుండడానికి నాకు మనస్కరించలేదు. వెళ్ళిపోతున్నాను.

ఆవిడున్నంతకాలం తిరిగి యీ యింట్లో అడుగుపెట్టలేను.

—శరత్.

కొన్నిక్షణాలు స్థాణువులా నిలబడిపోయాడు.

గంద్రగోళంగా సాగిపోతున్న ఆలోచనలనుండి తనని తాను సంబాళించుకోడానికి ఐదునిముషాలు పట్టింది 'కరుణాకర్‌కి. బరువుగా

అడుగులు వేసుకుంటూ మెట్లదగ్గరకొచ్చి ఆగాడు.

మెట్లక్రింద హాలులో వాజులోని వాడిన పూలు తీసివేసి తాజా పూలు అమరుస్తున్నది సరిత.

టక్‌టక్ మంటూ లయబద్ధంగా మెట్లు దిగివస్తున్న బూట్ల చప్పుడు విని చప్పున అక్కణ్ణించి వెళ్ళిపోబోయింది.

"ఆగు" గర్జన విని ఆగిపోయింది.

క్షణం నిశ్శబ్దం తరువాత కరుణాకర్ కంఠం గంభీరంగా వినిపించింది. "నీ పెంపకంలో పిల్లలు పెరగడం నా కిష్టంలేదు. రేపు ఉదయం బండికే నీ ప్రయాణం. సిద్ధంగా వుండు."

దిమ్మెరపోయింది సరిత.

'ఏమిటీ? తన పెంపకంలో పిల్లలు పెరగడం యిష్టంలేదూ? పిల్లల విషయంలో తనేం లోటు చేసిందని?'

చివ్వున తలెత్తి చూసింది.

అతనక్కడ లేడు.

రాతి బొమ్మలా నిలబడిపోయింది సరిత.

* * *

మరుచటి రోజు ఉదయం మిసెస్‌వర్మ ఫోన్‌చేసింది.

"కరుణా ఇంట్లో వున్నాడా?"

"లేరు."

"అసలు ఊర్లో వున్నాడా?"

"తెలీదు."

"తెలీదూ?!"

"కరుణా స్నేహితున్నాడా?"

"వెళ్ళిపోయారు."

"వెళ్ళిపోయాడా? అప్పుడే?? వుండాలని వచ్చాడటగా?"

"ఏమో మరి?"

"నీ గొంతేమిటి అలా వుంది?"

"జలుబు చేసింది."

"పిల్లలు బాగున్నారా? పనిలేకపోతే రారాదూ!"

"తలనొప్పిగా వుందండీ!"

"నీకు ఎప్పుడూ వోవంక రెడీగా వుంటుంది."

అక్కడేవున్న సోఫాలో కూర్చుని అలసటతో సోఫా వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు.

ఫోన్ పెట్టేసింది సరిత.

రెండురోజులు మామూలుగా గడిచిపోయాయి.

మూడోరోజు మిసెస్ వర్మ ఫోన్‌చేసి 'కరుణా వచ్చాడా?' అని అడిగినదానికి 'యింతవరకూ రాలేదు' అని జవాబిచ్చింది.

ఆ సాయంత్రం పోస్ట్‌మాన్ తెచ్చిచ్చిన ఉత్తరం చూసుకుని కంపించిపోయింది.

ఉత్తరం పట్టుకుని తోటలోకి పరుగుపెట్టింది.

"తాతా! మా నాన్నగారికి పక్షవాతం వచ్చి కాళ్ళూ, చేతులూ పడిపోయాయట. నోటిమాట కూడా పోయిందట."

సరిత చెక్కిళ్ళపై కన్నీళ్ళు కారిపోతున్నాయి.

"అమ్మాయిగారూ! ఇంకో గంటలో బండుంది. త్వరగా తెమలండి. స్టేషన్‌కి నే నొస్తాను." అన్నాడు.

"తాతా! నాకేదో భయంగా వుంది."

"భయపడకండి అమ్మాయిగారూ! పక్షవాతం వచ్చి తగ్గినోళ్ళు ఎంతమంది లేరు?" ధైర్యం చెప్పాడు.

సరిత తిరిగి లోపలికి పరుగెత్తి మిసెస్ వర్మకి ఫోన్ చేసింది.

"ఏమిటీ? మీ నాన్నగారికి అలా వుంటే వెళ్ళకపోతే ఎలా? నువ్వెళ్లు. పిల్లల్ని నేను చూసుకుంటాను. కరుణా వస్తే నేను చెపుతాలే. స్టేషన్‌కి నన్ను రమ్మంటావా?"

"ఒద్దు" సరిత గొంతు బొంగురుగా ధ్వనించింది.

ఫోన్ పెట్టేసి, గబగబా బేగ్‌లో రెండు చీరలు పెట్టుకుని బయల్దేరింది సరిత.

రైలు వేగాన్ని మించి సాగిపోతున్నాయి సరిత ఆలోచనలు.

'నాన్న యీమధ్య చాలాసార్లు తనని రమ్మని వ్రాశారు. ప్రతీ

ఉత్తరంలోనూ నువ్వు ఎలా వున్నావు? సంతోషంగా వుంటున్నావా తల్లీ!' యివే మాటలు. నాన్నని చూడాలని వున్నా వెడితే ఎక్కడ బయటపడిపోతానో అనే తను వెళ్ళలేదు. బహుశా శరత్ స్టేట్సు నుంచి వచ్చి అక్కడికి వెళ్ళుంటాడు....నాన్నకి తెలిసిపోయి వుంటుంది. అందుకే....ఆ అనుమానంతోనే తనసన్నిసార్లు రమ్మని వ్రాసుంటారు' అనుకునేసరికి సరిత కళ్ళనిండా నీళ్లు నిండుకున్నాయి.

'నాన్నా! నిజం తెలిసిపోయిన నీ మనసు బాధపడుంటుంది. ఆ బాధతోనే....ఆ ఆలోచనలతోనే నువ్వు మంచం ఎక్కివుంటావు. నీ ఆరోగ్యం చెడిపోడానికి కారణం నేనే నాన్నా!' పైకి ఏడ్వలేక దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ కూర్చుంది.

గుమ్మంలో ఆటో దిగి లోపలికి పరుగుపెట్టింది సరిత.

మంచంమీద కదులూ, మెదులూ లేకుండా, కంటిచూపు, నోటిమాట పడిపోయి శవంలా పడున్న తండ్రిని చూసి "నాన్నా!" అంటూ బావురుమంది.

"ఎన్ని ఉత్తరాలు వ్రాసినా వచ్చావా?....ఇప్పుడొచ్చావుగా! చూడు. మీ నాన్నతో మాట్లాడు" యేడుస్తూ వుండి వుండి ఆవిడం టున్న నిష్ఠూరపు మాటలు సరిత హృదయాన్ని తునాతునకలు చేసాయి.

"నాన్నా! ఒక్కసారి కళ్ళు తెరు నాన్నా! నీ సరిత నొచ్చా న్నానా!" ఏడుస్తున్న సరిత స్వరం ఎక్కడినుంచో వినిపిస్తు న్నట్లుగా వుంది శివరామయ్యగారికి.

కళ్ళు తెరవాలని ఆయన ప్రయత్నం. "అమ్మా! నీ మనసు తెలుసుకోకుండా, నీకన్యాయం చేశాను" అని చెప్పాలని ఆయన ఆరాటం. కంటి నిండుగా కడసారి కూతుర్ని చూసుకోవాలని ఆయన తపన. చేతులెత్తి కూతురి తల నిమరాలన్న కోరిక. ఏదీ—ఏదీ చేయలేకపోతున్నారాయన.

బలవంతంగా తెరవాలనుకుంటున్న కళ్ళు తెరిపిళ్లు పడటం లేదు. ఆ రాత్రే ఆయన ప్రాణవాయువు అనంతవిశ్వంలో కలిసి పోయింది. సరిత దుఃఖానికి అవధుల్లేవు.

పార్వతమ్మకు మతి భ్రమించింది. ఆవిడకి భర్త పోయిన పంగతి కూడా తెలీడంలేదు. మామూలుగా ఇల్లంతా తిరుగుతున్నది. "మీనాన్న వచ్చే వేళయింది. త్వరగా వంట చెయ్యి. ఎప్పుడో తిని వెళ్ళారు" అంటుంది.

ఇలా మాట్లాడుతున్న తల్లిని చూచి సరిత గుండెలు పగిలి పోతున్నాయి.

చుట్టుప్రక్కలవాళ్ళు "ఇలా వున్నావిడ్ని వొదిలిపెట్టి వెడతావా? ఒక్క మనిషి మీకు బరువా? తీసుకుపో!" అని అంత డబ్బుగల వాడుగా మీ ఆయన, అదేం ముతక చీరలు కడుతున్నావు? ఒంటిమీద నగన్నా లేదే? ఇలా వాళ్ళు వేసే ప్రశ్నలకు జవాబియ్యలేక బేజారయి పోయింది సరిత హృదయం.

చివరికి పక్కింటి మీనాక్షమ్మకి, రాఘవయ్య తాతకీ తల్లిని అప్పగించి, తనవెంట తెచ్చిన డబ్బు ఆవిడకిచ్చి, "పిన్నిగారూ! అమ్మని జాగ్రత్తగా చూసుకోండి. నేను మళ్ళీవచ్చి తీసుకెడతాను" అనిచెప్పి రైలెక్కింది సరిత.

* * *

కరుణాకర్ యింకా రాలేదని తెలుసుకుని గుండెలమీద బరువు దిగినట్లు ఫీలయింది సరిత.

పిల్లల్ని తీసుకురమ్మని రంగన్నను, వర్మగారింటికి పంపింది. మిసెస్‌వర్మ పిల్లల్ని వెంటపెట్టుకొచ్చింది.

సరితకి దుఃఖం ఆగలేదు.

"పిచ్చిపిల్లా ఏమిటా ఏడుపు? ఆయన బాధ్యతలన్నీ తీర్చుకునే పోయారు. పచ్చికాయలే పగిలిపోతున్న యీ రోజుల్లో జబ్బుమనిషి పోవడంలో వింతేముంది. మీ అమ్మగారిని తీసుకురాకపోవడం పొరపాటే. ఆవిడకి మాత్రం ఎవరున్నారు? కరుణాకరానికి నేను చెపుతాలే" అని వోదార్చింది.

ఆవిడ వెళ్ళాక పిల్లలకి అన్నాలు తినిపించి పడుకోబెట్టింది. నిద్రరాక వొంటరిగా కూర్చున్న సరిత ఊహల్లో తండ్రి.........మతి భ్రమించిన తల్లి....సావిత్రి, కరుణాకర్....శరత్ వొక్కొక్కరే

మెదలసాగారు. మనసు బరువెక్కింది.

జీవితం అంటే ఏమిటి? సుఖదుఃఖాల కలయికల్ని అనుభవిస్తూ సాగిపోవడమేనా? ఇంకేమీ కాదా? కళ్లు మూసుకుని అలాగే కూర్చుండి పోయింది.

గోడ గడియారం ఠంగుఠంగున గంటలు కొడుతున్న శబ్దంతో పాటు తలుపు కొట్టిన చప్పుడు విని ఉలిక్కిపడి లేచి నిలుచుంది. "బావ వచ్చేశారు తలుపు తియ్యాలి. ఎదురుగా చూడగానే యింకా యిక్కడే వున్నావా? అంటూ మెడపట్టి గెంటేస్తారు" సరిత గుండెలు దడదడలాడాయి.

మళ్ళీ తలుపు మీద కొట్టిన చప్పుడు.

గుండె దిటవు చేసుకుని గబగబా వెళ్ళి తలుపు తీసింది.

తెల్లబోయిందీ.

గుమ్మానికి ఆనుకుని నిలబడడానికి ప్రయత్నిస్తున్నాడు కరుణాకర్. అతని కళ్ళు చింతనిప్పుల్లా వెలిగిపోతున్నాయి.

అతను బాగా తాగి వచ్చాడు.

"సావిత్రీ" తూలి ముందుకు పడబోయిన అతన్ని పడకుండా పట్టుకుని ఆపింది సరిత.

"సావిత్రీ! పొరపాటు చేసాను....ఇంకెప్పుడూ తాగను" ఆతని కాళ్ళు భూమ్మీద నిలవడం లేదు. సరితకి అతన్ని ఆపడం చేతకావడం లేదు. ఈ స్థితిలో మేడమీది గదికి యితన్ని చేర్చడం కష్టం అనుకుని క్రింద వాడకుండా వున్న సావిత్రి గదివైపు నడిపించింది. అతను బరువంతా సరితమీద వేసి తూలిపోతూ అడుగులు వేస్తున్నాడు.

అతి కష్టంమీద అతన్ని గదిలోకి తీసుకెళ్ళి మంచం మీద కూర్చోపెట్టింది.

త్రాగిన మైకంలో వున్నాడు. ఎదురుగా వుండటం మంచిది కాదు అనుకుని వెళ్ళే ప్రయత్నంలో వెనక్కి తిరిగింది.

"సావిత్రీ!"—రెక్క పుచ్చుకుని లాగాడు.

అ వూపుకి అతని మీద పడబోయి మంచంపట్టీ పట్టుకుని

ఆగిపోయింది సరిత.

"ఇన్నాళ్ళకి కనిపించావు. అప్పుడే వెళ్ళిపోతావా! నిన్ను వదలను" చేయి పట్టుకుని లాగి ఎదురుగా నిలబెట్టుకున్నాడు. బాణం దెబ్బతిన్నలేడిలా విలవిలలాడిపోతూ "బావా!" అంది. అతని రెండు చేతులూ బలంగా సరిత బుజాలమీద పడ్డాయి.

"సావిత్రీ! యిన్నాళ్ళూ ఎక్కడికి వెళ్ళావు?....నన్నొదిలిపెట్టి యింకెప్పుడూ వెళ్ళనని చెప్పు. చెప్పు సావిత్రీ!" కళ్ళు వెడల్పు చేసుకుని చూడ్డానికి ప్రయత్నిస్తున్నాడు.

"బావా.... నే.... నేను....సరితని."

గొంతు పెగుల్చుకుని ఎలాగో అంది.

కళ్ళు చికిలిస్తూ, రెండు చేతుల్లోకి సరిత ముఖాన్ని తీసుకుని ముఖంలో ముఖం పెట్టి పరీక్షగా చూశాడు. గుడ్లనిండా నీళ్ళతో, అదురుతున్న పెదాలతో నిలువెల్లా వణికిపోతూంది సరిత.

"ఛీ! నువ్వా!" ఒక్క తోపు తోశాడు.

ఆ విసురుకి వెళ్ళి గోడకు గుద్దుకుని ఆగింది.

తేరుకుని ఒక్క ఉదుటున అక్కడినుంచి తన గదిలోకి పరుగుతీసి తలుపులు మూసుకుంది.

గుండెల మీద చేతులు వేసుకుని భయంతో, అలసటతో ఆ తలుపులకే జేరబడి నిలబడిపోయింది.

అప్రయత్నంగా సరిత కళ్ళు గోడకు తగిలించి వున్న సావిత్రి ఫోటో మీదికి మళ్ళాయి.

బెడ్ లైటు వెలుగులో సావిత్రి కళ్ళు ఉరిమి చూస్తున్నాయి. "మనసొకరికీ, శరీరం మరొకరికీ పంచివ్వలేనక్కా! నన్ను క్షమించు" తనలో తనే అనుకుంది.

పరుగున వెళ్ళి మంచం మీద వాలిపోయింది.

* * *

ఉదయం ఎనిమిది గంటలయింది.

కరుణాకర్ పడుకున్న గదిలోనుంచి సన్నగా మూలుగు వినిపిస్తూవుంటే, గదిలోకి తొంగి చూసింది సరిత. బూట్లన్నా విప్పుకో

కుండా పడుకునున్నాడు కరుణాకర్. కాస్సేపు తటపటాయించి మెల్లగా లోపలికి వెళ్ళింది. వుండి వుండి మూల్గుతున్నాడు. అతని ముఖమంతా కందినట్లు ఎర్రగా వుంది.

మెల్లగా వంగుని బూట్లువిప్పి మంచం క్రింద పెట్టింది. సాక్సు తీస్తూంటే కాళ్ళు వెచ్చగా అనుపించి తాకీతాకనట్లుగా అతని చేతిమీద చేయివేసి చూచింది. నిప్పుని ముట్టుకున్నట్లుగా చప్పున చేతిని వెనక్కి లాక్కుంది. డాక్టరుకి ఫోన్ చేసింది.

"భయపడకండి. పది నిముషాల్లో వచ్చేస్తాను." ధైర్యం చెప్పి ఫోను పెట్టేసాడు డాక్టరు.

వర్మగారి నంబర్ డయిల్ చేసింది.

వర్మగారే పలికారు.

తడబడుతూ చెప్పింది.

పది నిముషాల్లో వర్మగారి కారు, డాక్టరుగారి కారు వెనకా ముందుగా పోర్టికోలో కొచ్చి ఆగాయి.

స్పృహ లేకుండా పడున్న కరుణాకర్ని పరిశీస్తూ వివరాలడిగాడు డాక్టర్.

అతను తాగి వచ్చాడన్న సంగతి చెప్పలేదు సరిత.

ఇంజక్షనిచ్చి, మరికొన్ని మందులు వ్రాసిస్తూ ఎప్పుడెప్పుడు ఏయే మందులు వాడాలో సరితకి వివరించాడు డాక్టర్.

"ముందు జ్వర తీవ్రత తగ్గాలి. ఐస్‌బేగ్ పెట్టండి. స్పృహ రాగానే ఫోన్‌చేసి చెప్పండి." అని వెళ్ళిపోతున్న డాక్టర్ వెనుకే వెళ్ళారు వర్మగారు.

అతనడిగిన ప్రశ్నకి "రెండు రోజులు చూస్తేగానీ ఏం జ్వరమో చెప్పలేమండీ! భయపడవలసిన అవసరం మాత్రం లేదు. మరోగంట, రెండు గంటల్లో స్పృహరావచ్చు." అని కాస్సేపు వర్మగారితో మాట్లాడి వెళ్ళిపోయాడు డాక్టర్.

వర్మగారు తిరిగొచ్చి కుర్చీలో కూర్చున్నారు.

అప్పుడప్పుడు మూల్గుడుతప్ప కరుణాకర్‌లో చలనంలేదు.

కరుణాకర్ ప్రక్కనే కుర్చీ వేసుకుని కూర్చుంది మిసెస్

వర్మ.

మంచం వెనుక నిలబడి ఐస్‌బేగ్‌తో కరుణాకర్ నుదుటిమీద కాపుతున్నది సరిత.

ఉన్నట్లుండి వర్మగారడిగారు. "ఏమ్మా! రాత్రి కరుణాకర్ తాగి వచ్చాడా?"

సరిత మొదట తటపటాయించింది. తరువాత 'ఔను' అని తల వంచుకునే జవాబిచ్చింది.

వర్మ దంపతులు తెల్లబోయారు.

ఎప్పుడూ త్రాగని కరుణాకర్ ఇప్పుడు తాగాడంటే....?! ఏదో బలవత్తరమైన కారణమే వుండివుండాలి....వర్మగారి మెదడు చురుగ్గా ఆలోచిస్తోంది.

మిసెస్ వర్మ చూపులు సరిత ముఖంమీద నిలిచిపోయాయి. రాత్రంతా నిద్రలేని సరిత కళ్ళు జ్యోతుల్లా వెలుగుతున్నాయి. రెప్పలు బరువుగా వాలిపోతున్నాయి.

నిర్వికారంగా నిలబడి ఐస్‌బేగ్ కాపడంపెడుతున్నది.

"నేను వెడతాను. నువ్విక్కడే వుండి స్పృహ రాగానే ఫోను చెయ్యి." అని చెప్పి వర్మగారు వెళ్ళిపోయారు.

నిముషాలు, గంటలు దొర్లుతున్నాయి. కరుణాకర్‌లో చలనం లేదు.

ఒకటి, రెండుసార్లు 'సావిత్రి' అన్న పలవరింత అస్పష్టంగా వినిపించి నిట్టూర్చింది మిసెస్ వర్మ.

పదిగంటల సమయంలో కళ్ళు తెరిచాడు కరుణాకర్.

మిసెస్ వర్మ అతని ప్రక్కలో కూర్చుని నుదుటిమీద పడుతున్న వెంట్రుకలను వెనక్కితోస్తూ "కరుణ్‌బాబూ!" అంటూ ఆప్యాయంగా పిలిచింది.

"ఎలా వుంది?" ముఖంలో ముఖంపెట్టి ఆత్రుతగా అడిగింది.

"సరితా! త్వరగా హార్లిక్సు కలిపి తీసుకురా. స్పృహ వచ్చిందని డాక్టరుగారికి ఫోనుచెయ్యి."

ఆవిడ మాటలకి ముఖం చిట్లించుకుని, కళ్ళు మూసుకున్నాడు.

హార్లిక్సుగ్లాసు అందించి, డాక్టరుగారికి ఫోన్ చేయడానికి వెళ్ళింది సరిత.

"బాబూ! కరుణ్! ఇలా చూడు. ఈ కాస్త తాగేసి పడుకో-"

మిసెస్ వర్మ మాటలు ఎక్కడినుంచో వినిపిస్తున్నట్లుగా వున్నాయి కరుణాకర్‌కి. కళ్ళు మూతలు పడిపోతున్నాయి. మళ్ళీ స్పృహ తప్పింది.

మిసెస్ వర్మ కంగారుపడుతూ "సరితా! మళ్ళీ స్పృహ తప్పాడని చెప్పు డాక్టరుకి." సరితకి వినబడేలాగు కేకేసి చెప్పింది.

డాక్టర్ పరీక్షించి "భయపడవలసిన అవసరం లేదు. లేవగానే వేడివేడిగా యేదైనా తాగించండి." అని మరో యింజక్షన్ యిచ్చి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రంవరకూ అక్కడే గడిపి వెళ్ళింది మిసెస్ వర్మ.

మూడు రోజులు విపరీతంగా కాసిన జ్వరం నాలుగోరోజు తగ్గుముఖం పట్టింది.

వర్మ దంపతులతోపాటు సరితకూడా 'హమ్మయ్య' అనుకుంది.

జ్వరం తగ్గిన ఆ మరుచటిరోజు—మంచానికి ఆనుకుని కూర్చుని, తను ఊర్లోలేనప్పుడు వచ్చిన ఉత్తరాలు చదువుంటున్నాడు కరుణాకర్.

మిసెస్ వర్మ లోపలికొస్తూ "ఏంపని అది కరుణ్‌బాబూ! ఇంకా పత్యమయినా తీసుకోలేదు. ఇప్పుడా ఉత్తరాలు చదవకపోతే ఏం? కళ్ళు నొప్పులు పెట్టవూ?" అంటూ చొరవగా మంచందగ్గర కొచ్చి, అతని చేతిలో వుత్తరాలు లాక్కుని టేబులుమీద పెట్టింది.

కరుణాకర్ ఆమెవైపు నవ్వుతూ చూచాడు.

"ఆ — ఇప్పుడు నవ్వుతున్నావుగానీ, మూడు రోజులు మమ్మల్ని హడలగొట్టేసావు." అతని మంచంమీద కూర్చుంది.

అంతలో డాక్టర్ కుల్‌కర్ణి "హౌఆర్‌యు మిస్టర్ కరుణాకర్!" అంటూ లోపలికొచ్చాడు.

అతను ఆర్మీ డాక్టర్ అవడంవలన మిసెస్ వర్మకికూడా పరిచయమే.

ఆమెకి నమస్కరించి, కరుణాకర్ మంచం ప్రక్కగా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

"మీకు భయపడి జ్వరం పారిపోయింది డాక్టర్!"

కరుణాకర్ నవ్వుతూ అన్నమాట కడ్డొచ్చి—

"నాకూ, నా వైద్యానికీ జడిసి కాదు బాబూ! నీ జ్వరం పారిపోత, నీది—ఉక్కు....ఉక్కు శరీరం. నీకు జ్వరమంటే నేను నమ్మలేదనుకో—"

'డాక్టరువి దిష్టికళ్లు' అనుకుంది మిసెస్ వర్మ.

కరుణాకర్ నవ్వి వూరుకున్నాడు.

"ఇక మందులన్నీ వాడనవసరం లేదు. టాబ్లెట్సు వేసుకుంటే చాలు. ఆ ప్రిస్క్రిప్షన్ ఎక్కడ?"

"ఉండండి డాక్టర్! ఆ మందుల సంగతి సరితకే తెలుసు." గుమ్మంవరకూ వెళ్ళిన మిసెస్ వర్మ "సరితా! డాక్టరుగారు పిలుస్తున్నారు" అని లోపలున్న సరితకి వినపడేలా కేకేసి చెప్పింది.

సరిత చేతిలోని ప్రిస్క్రిప్షన్ కాగితం అందుకుని, కొన్ని పేర్లు కొట్టేసి, ఏవేవి వాడాలో చెప్పాడు. మరికొన్ని మందులపేర్లు వ్రాసి ఆ కాగితం తిరిగి అందిస్తూ "ఈ క్రింద వ్రాసిన మందులు మీకు. ఇవి మీరు వాడండి." అన్నాడు.

"నేనా? ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగింది సరిత.

"మీరే నిజమైన పేషంటులా వున్నారు. వొంట్లో రక్తంలేక చర్మమంతా ఎలా పాలిపోయిందో చూడండి. బలమైన ఆహారంతో పాటు యీ మందులు వాడకపోయారో, త్వరలో మంచమెక్కక తప్పదు. డాక్టరుగా ముందే మీకా సలహా యిస్తున్నాను."

అతని మాటలకి సరిత ముఖం నిజంగానే పాలిపోయింది. కొద్దిగా తలెత్తి కరుణాకర్‌వంక చూసింది.

అదే సమయంలో కరుణాకర్, సరితని పరీక్షగా చూస్తున్నాడు.

చప్పున తల దించుకుని గదిలోనుంచి బయిటకి వెళ్ళిపోయింది సరిత.

* * *

మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటింది. పిల్లలకు అన్నాలు పెడుతూంది సరిత.

"అమ్మాయిగారూ! యివిగో మందులు." గుమ్మంలో నిలబడి అన్నాడు రంగన్న.

"వస్తున్నా!" చేయి తుడుచుకుంటూ వచ్చి, మందులడబ్బా అందుకుని తెరిచి చూచింది.

క్రితంరోజు డాక్టర్ తనకి వ్రాసిన మందులవి.

చేతిలో మందుల డబ్బాతో కొన్ని క్షణాలు స్థాణువులా నిలబడి పోయింది సరిత.

"పిన్నీ!" లోపల్నించి రవిచంద్ర పిలిచాడు.

మందులా డబ్బా అల్మారులో పెట్టి, యాంత్రికంగా అటు నడిచింది.

ఆ రోజు సాయంత్రం మిసెస్ వర్మ వచ్చి కాస్సేపు కూర్చుని వెళ్ళింది.

రెండు రోజులు గడిచాయి.

"పిన్నీ! డాడీ పిలుస్తున్నారు."

ఎంబ్రాయిడరీ చేస్తున్న ఫ్రాకు ప్రక్కన పెట్టి లేచి వెళ్ళింది.

సోఫాలో కూర్చుని పాపకి బాలు విసురుతున్నాడు కరుణాకర్.

పాప కిలకిల నవ్వుకుంటూ బంతినితెచ్చి అతని కందిస్తున్నది.

"ఆగిపోయావేం. రా పిన్నీ!" సరిత చేయిపట్టి లాగాడు రవిచంద్ర.

తలెత్తి చూచాడు కరుణాకర్.

బుజాల నిండుగా కొంగు కప్పుకుని, గుమ్మంలో తలొంచుకుని నిలబడివుంది సరిత.

"మీ నాన్నగారు పోయారట." పాపకి బాలు విసురుతూ అడిగాడు. "మీ అమ్మగారిని పిలిపించమంటావా?" పాప చిట్టి చేతుల్లోంచి బంతిని అందుకున్నాడు.

ఉరుములు, పిడుగులు వర్షించినట్లు తనని తిట్టి, బయిటికి పొమ్మంటాడు అనుకున్నది సరిత. అందుకు భిన్నంగా ఎంతో ఆత్మీ

యంగా, ఉదారంగా అతను మాట్లాడుతుంటే సరితకి మతిపోయింది.

మౌనంగా వుండిపోయింది.

"చెప్పు సరితా! పోనీ నువ్వెళ్ళి తీసుకొస్తావా?" సౌమ్యంగా అడుగుతుంటే భరించలేకపోయింది.

"ఉత్తరం వ్రాసి కనుక్కుంటాను" చివరికెలాగో అన్నది.

"నీ యిష్టం." పాపను ఒళ్ళోకి తీసుకున్నాడతను.

'బావ మారిపోతున్నాడు. అతని నిజరూపం బయటపడటానికి యింకెంతోకాలం పట్టదు.' అనుకుంది. అక్కడ నిలబడలేనట్లు లోపలికి వెళ్ళిపోయింది.

* * *

మిసెస్ వర్మ, సరిత గదిలో కొచ్చేసరికి సరిత మంచంమీద పడుకునుంది.

"మందులు వాడకపోతే నీరసం ఎలా తగ్గుతుంది?" మంచానికి దగ్గరగా వున్న కుర్చీలో కూర్చుంటూ అంది మిసెస్ వర్మ.

సరిత లేచి మంచంమీదే కూర్చుంది.

"నువ్వు మందులు వాడటం లేదని కరుణాకర్ బాధపడుతున్నాడు. అతని ఆరోగ్యం సంగతి మర్చిపోయి నీగురించి దిగులు పెట్టుకున్నాడు. మగవాడి మనసు కష్టపెట్టడం మంచిదికాదు సరితా! నీకేం లోటని? సుబ్రంగా తింటూ, డాక్టరు వ్రాసిచ్చిన మందులు వాడు. బంగారు బొమ్మలా వుండేదానివి. పిండిబొమ్మలా తయారయ్యావు."

కళ్ళప్పగించి ఆవిడ మాటలు వింటూ వుండిపోయింది సరిత.

మిసెస్ వర్మ గదిలోంచి వెళ్ళిపోయింది.

కరుణాకర్ డ్యూటీకి వెళ్ళి వస్తున్నాడు.

ఆరోజు సాయంత్రం ఏం తోచక అల్మారులో బొమ్మలు తీసి దుమ్ము దులిపి సర్దుతోంది సరిత.

"పిన్నీ! డాడీ—నాకు, చెల్లికి, నీకు బట్టలు తెచ్చారు." చేతిలో పేకట్లతో పరుగెత్తుకొచ్చాడు రవిచంద్ర.

"ఇదిగో నీచీర"—అట్టపెట్టిలోంచి చీర బయిటికి తీశాడు.

మడత వూడిపోయిన చీరను రెండు చేతుల్తో పట్టుకుని "తీసుకో పిన్నీ! యిది నీకే!" సరిత వొంటిమీద పెట్టబోయాడు.

మీద బల్లి పడినట్లు విదిలించుకుని, దూరంగా జరిగి నిలబడింది సరిత.

చీర కుప్పలా క్రింద పడిపోయింది.

"నచ్చలేదా?"

తలెత్తి చూచి కొయ్యబారిపోయింది.

గుమ్మంలో నిలబడి వున్నాడు కరుణాకర్.

"చీరల విషయం నాకంత బాగా తెలీదు. ఇదే మొదటిసారి తేవడం. నచ్చకపోతే రంగన్నను వెంటపెట్టుకెళ్ళి, నీకు నచ్చినవి తెచ్చుకో."

"లేదు. లేదు. ఇంత ఖరీదువి ఎందుకని...."

కాళ్ళ దగ్గర కుప్పలా పడున్న చీరను చేతుల్లోకి తీసుకుంది.

"ఈ మాత్రానికేనా!"

అతను వెళ్ళిపోయాడు.

చేతిలో చీరతో పాలరాతి బొమ్మలా నిలబడిపోయింది సరిత.

ఆరాత్రి సరితకి నిద్రపట్టలేదు. మనసంతా ఆలోచనలతో గజిబిజిగా వుంది. 'రచయిత చేతిలో పాత్రలు కీలుబొమ్మలు. విధిచేతిలో మనుషులూ అంతే. తేడాలేదు.' అనుకుంది స్వయంగా రచయిత్రి అయిన సరిత.

తనూ కథలూ, నవలలూ వ్రాసింది. ఐతే జరుగుతున్న యీ జీవిత నాటకానికి పరిసమాప్తి ఎక్కడో! ముగింపు ఎలా వుంటుందో ఊహించలేకపోతోంది. కరుణాకర్ మనసు మార్చుకున్నాడని తను, అతనికి లొంగిపోతుందా?

మనసొకరికీ, శరీరం మరొకరికీ పంచడం చేతకాదనుకున్న తను ఆ మాటకు కట్టుబడే నిలుస్తుందా? ఇటువంటి సంకట పరిస్థితులలో అక్కకిచ్చిన వాగ్దానం నిలబెట్టుకోగలదా? తన ప్రియురాలు, తన ప్రాణస్నేహితుని భార్యే అని చూచి వెళ్ళిన శరత్—తనపట్ల అసహ్యం పెంచుకుని, విరక్తితో పెళ్ళి చేసుకుంటాడా?

లేక జీవితాంతం నరకాన్ని అనుభవిస్తాడా?

అన్నీ సమాధానం దొరకని ప్రశ్నలే.

ఇక ఆలోచించే వోపికలేనిదానిలా మంచంమీద వొరిగిపోయి బలవంతంగా కళ్ళు మూసుకుంది.

* * *

కరుణాకర్ యింటినుంచి తిరిగొచ్చిన శరత్ తనని మోసం చేసిన యువతికి తగిన శాస్తి చేసాను అన్న తృప్తితో నాలుగు రోజులు మామూలుగానే వున్నాడు. ఆ తరువాత అతనిలో కోపాన్ని, ఉద్విగ్నతనీ అణిచి వివేకం మేల్కొంది.

ఆ నాటినుండీ అతనికీ, అంతరాత్మకీ మధ్య ఘర్షణ ప్రారంభమయింది.

ఆ రోజు___

రాత్రి యింకా బాగా చిక్కబడలేదు.

శూన్యంలోకి చూస్తూ కిటికీదగ్గర నిలుచున్నాడు శరత్.

"నువ్వు చేసినపని మంచిదికాదు. నీ చదువు, సంస్కారం అన్నీ మర్చిపోయి ఒక కిరాతకుడిలా ప్రవర్తించావు. నీ ప్రాణ స్నేహితునికి ఎగ్గు తలపెట్టావు.

ఆ నాడు అతనే కల్పించుకోకపోయినట్లయితే యీపాటికి నువ్వెలా వుండేవాడివో వూహించు.

రోడ్లమ్మట జులాయిగా తిరుగుతూ, డబ్బుతో జల్సాలు చేసుకుంటూ వో జూదరిగా తయారయ్యేవాడివి. అటువంటి నిన్ను వో మార్గంలో పెట్టి, నిన్నో మనిషిగా చేసాడతను. సొంత తమ్ముడిలా అభిమానించాడు. అతని సుఖాలలో తప్ప కష్టాలలో నీకు పాలుపంచలేదు. అటువంటి మహనీయునికా నీవు అపకారం చేస్త. ఇదేనా స్నేహధర్మం?

స్నేహం అంటే అర్థం తెలీని నువ్వు స్నేహధర్మం అంటూ తప్పుడు రాతలు రాసొచ్చావు. భార్యపోయిన దుఃఖంలో వున్నాడు. పసిపిల్లలకోసం మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు. ఇదేనా అతను చేసిన నేరం? తను చేసుకున్న పిల్ల, నీ ప్రియురాలని అతనికేం తెలుసు!

ఆ స్థానంలో నువ్వున్నా అంతకన్నా ఏంచేసి వుండేవాడివి? భార్యపట్టి నీచురాలు. పాతకి అని తెలిశాక ఏ మగాడు భార్యతో కాపురం చేయడానికి యిష్టపడతాడు? మాట్లాడవేం?

కరుణాకర్ పట్టుదల మనిషి. నీచాన్ని సహించలేడు. కాలు జారిన స్త్రీపట్ల అతనికి బొత్తిగా సానుభూతిలేదు. మనోనిగ్రహం లేకుండా తప్పుచేయడం దేనికి? ఆడది మెత్తబడకపోతే మగవాడు మేంచేయలేడని అతని నమ్మకం. తన భార్య అటువంటిదని తెలిస్తే సహించగలడా? కాల్చి చంపేస్తాడు? ఆ తరువాత అతని సంగతి ఏమిటి? పిల్లలేమౌతారు? ఈ పాపమంతా నీదికాదూ? నీకు చేసిన సహాయానికి, అతనికి నువ్విచ్చే ప్రతిఫలం యిదేనా? వెళ్ళు. నిజం చెప్పేసి తప్పు క్షమించమను."

"నావల్ల కాదు."

'కాదు' అంటే సరితకి అన్యాయం జరిగిపోతుంది.

"జరగనీ. నాలా, తనూ నరకాన్ని అనుభవించాలి" కసిగా అంతరాత్మకి సమాధాన మిచ్చాడు శరత్.

పగలబడి నవ్వింది అంతరాత్మ.

"ఎందుకు నవ్వుతున్నావ్?"

"నీ వెర్రి సమాధానానికి."

తాత్కాలికమైన కోపంలో నువ్వుచేసిన పనికి, నీలో నువ్వే బాధపడుతూ పైకి లేదని బుకాయిస్తున్నావు. సరితను నువ్వు ప్రేమించావు. సరితే నీ వూపిరన్నావు. సరితే నీ ప్రాణమన్నావు. సరితే నీ ఊహన్నావు. సరిత లేనిదే నీవు లేనన్నావు. అటువంటిది ఆమెకి అన్యాయం జరిగితే నువ్వు సహించగలవా? వెళ్ళు సరితను రక్షించు.

అంతరాత్మ ఘోషని భరించలేక కళ్ళు గట్టిగా మూసుకున్నాడు శరత్.

అతని గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

రక్తపు మడుగులో గిలగిల తన్నుకుంటున్నది సరిత.

ఆమె ప్రక్కనే తుపాకీ పట్టుకుని వికటాట్టహాసం చేస్తూ

నిలుచునున్నాడు కరుణాకర్.

"వీల్లేదు. అలా జరగనివ్వను." కిటికీ వూచలని బలంగా పట్టుకుని గట్టిగా అరిచాడు శరత్.

మరుక్షణం పిచ్చివాడిలా నాలుగేసి మెట్ల చొప్పున దిగుతూ క్రిందికొచ్చాడు. కారు బయటికి తీసి స్టార్ట్‌చేసాడు.

పడకగది కిటికీ గుండా ఆ దృశ్యం చూసిన అరుణాదేవి భారంగా నిట్టూర్చింది.

* * *

"సరితా!"

సుపరిచితమైన కంఠస్వరం విని వెనక్కి తిరిగిచూపి నిర్ఘాంత పోయింది సరిత.

"సరితా!"—రెండడుగులు ముందుకొచ్చి అంతలోనే ఎవరో పట్టి ఆపినట్లు టక్కున ఆగిపోయాడు శరత్.

సరిత చేతిలో చీపురు జారి క్రింద పడిపోయింది.

కళ్ళనిండుగా సరితనే చూస్తున్నాడు శరత్.

సరిత కూడా తనను తాను మర్చిపోయి అతన్నే చూస్తున్నది.

ఒకర్నొకరు చూసుకుంటూ రెండు క్షణాలు వుండిపోయారు.

శరతే ముందుగా తేరుకున్నాడు.

సాదాచీర. అస్తవ్యస్తంగా గాలికి ఎగిరి ముఖంమీద పడుతున్న వెంట్రుకలు. తలమీద దుమ్ము, బూజు. చిక్కి పాలిపోయిన శరీరంతో చందనపు బొమ్మలా నిల్చునివున్న సరితను తదేకంగా చూస్తూ "నిన్నిలాకూడా చూస్తాననుకోలేదు సరితా!" అన్నాడు.

ఆశ్చర్యంగా చూసింది సరిత.

పీక్కుపోయిన ముఖం. ఎర్రబారిన కళ్ళు. మాసిన గడ్డం నలిగిన బట్టలు. పిచ్చోడిలా వున్న శరత్‌ని చూస్తూంటే కడుపులో దేవినట్లయింది సరితకి. నీట్‌గా, ఖరీదైన బట్టల్లో ఎప్పుడూ హుషారుగా వుండే శరత్ యిలా మారిపోవడానికి కారణం తనే అనుకునేసరికి సరితకి గుండెల్లోంచి మంటలాంటిది బయల్దేరింది. ఈ మంటను భరించలేక గుండె ఆగిపోతే బాగుండును అనుకుంది.

"చివరికి నీ మీద యీ విధంగా కపి తీర్చుకుంటున్నాడన్న మాట."

సరిత వైపు చూశాడు శరత్.

అయోమయంగా అతనివైపొకసారి చూపి తల దించుకుంది సరిత.

"సరితా! యీ స్థితికి కారణం నేనే అంటే నమ్ముతావా? నన్ను క్షమించగలవా?"

అతనంటున్నదేమిటో సరితకి అర్థంకాలేదు. ఏంమాట్లాడాలో తోచలేదు.

శరత్ సోఫానానుకుని సరితవైపు వీపుపెట్టి నిలబడి చెప్పసాగాడు.

"స్టేట్సునుంచి తిరిగొచ్చిన ఆ రోజు....వర్షంలో తడుస్తూ నిన్ను చూడాలని పుట్టెడాశతో మీ యింటికి వెళ్ళాను. నువ్వేవచ్చి తలుపు తెరుస్తావని ఎదురుచూసాను. మీ నాన్నవచ్చి తలుపు తీసారు. నిన్ను పిలవమన్నాను. మద్రాసులో వుంటున్నది, సరితకి పెళ్ళయి పోయింది అన్నారు. నమ్మలేకపోయాను. బలవంతంగా చేశారేమోనని అడిగాను. అమ్మాయి యిష్టంమీదే పెళ్ళి జరిగింది, పెళ్ళయి ఆర్నెలయిందికూడాను అన్నారు. అప్పటికి నా పరిస్థితి వూహించు— ఇంటికెళ్ళి టేప్ ఆన్ చేసాను. స్టేట్సుకి వెళ్ళే ముందురోజు నువ్వన్న మాటలు....కోపం పట్టలేకపోయాను. దాన్ని నేలకేసి కొట్టాను. ఆ పిచ్చికోపంలో నీకోసం తెచ్చిన వస్తువులన్నీ విసిరికొట్టాను. నువ్వు వ్రాసిన ఉత్తరాల్ని చింపి ముక్కలుచేసాను. ఐనా కోపం చల్లారలేదు. నిన్ను మర్చిపోవాలని చాలా ప్రయత్నించాను....నావల్ల కాలేదు. మనం కలిసి తిరిగిన చెట్లవెంట, తోటల్లో తిరుగుతుంటే— నాకు పిచ్చి పట్టిందనుకున్నారు. అమ్మ రేఖని పిలిపించింది. రేఖ తనని పెళ్ళాడమని నా వెంట పడింది. అటువంటి పరిస్థితులలో మనశ్శాంతి కోసం యిక్కడికి వచ్చాను. నిన్ను కరుణాకర్ భార్యగా చూసి మతి పోయింది. ఆ పిచ్చి ఆవేశంలో నేనెంత బాధపడుతున్నానో నీకు తెలిసిరావాలనుకున్నాను. నీ శీలం మంచిదికాదని కరుణాకర్‌కి చీటీ

వ్రాసిపెట్టి వెళ్ళిపోయాను. కోపం చల్లారాక కానీ నా తప్పు తెలిసి రాలేదు" చప్పున సరిత కభిముఖంగా తిరిగాడు.

"సరితా! నువ్వు నూరేళ్ళు సుఖంగా వుండాలి. నేను వ్రాసిందంతా అబద్ధమేనని కరుణాకి చెప్పేస్తాను. నిన్ను ఎప్పటిలా చూసుకోమని ప్రతిమాలుకుంటాను. ఇక మీమధ్యకి ఎప్పుడూ రాను. వెళ్ళిపోతాను."

సరిత తలెత్తలేదు. తెగిన పూసలదండలో పూసల్లా ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

శరత్ సోఫాని చుట్టివచ్చి ఆమె కెదురుగా నిలుచున్నాడు.

"సరితా! చిన్న సందేహాన్ని తీరుస్తావా?"

"..............."

"మాట్లాడు సరితా! ఈ ఒక్కసారికి మనసు విప్పి మాట్లాడు చాలు. మళ్ళీ జన్మలో నీ ఎదుటికి రానని ప్రమాణం చేస్తాను."

"అడగండి" పూడుకుపోయిన గొంతును పెగుల్చుకుని అంది సరిత.

"నువ్వు—నువ్వు, నన్ను ప్రేమించలేదా? ఆ రోజులన్నీ వట్టివేనా?"

కళ్ళెత్తి చూసింది సరిత.

నీరు నిండిన ఆ కళ్ళలోతుల్లో ఏదో వెదకడానికి ప్రయత్నించాడు శరత్.

సరిత తల దించేసుకుంది.

"నా జీవితంలో ఎందుకు ఆటలాడావు? నన్నెందుకు నమ్మించి మోసం చేసావు? చెప్పు సరితా?" ఆవేదనతో కూడిన ఆవేశంతో అడిగాడు.

సరిత మౌనం వహించింది.

"సరితా! ప్లీజ్! ఈ ఒక్క ప్రశ్నకీ నాకు సమాధానం కావాలి. చెప్పు. ఎందుకు నటించావలా?" ఉద్విగ్నుడవుతూ అన్నాడు.

"నటించలేదు." పూడుకుపోయిన గొంతును పెగుల్చుకుని స్థిరంగా అంది.

"నటించలేదూ!? అయితే....నిజంగా....నిజంగానే నన్ను ప్రేమించావా?"

ఏం చెపుతుంది తను!

శరత్‌కి తనని తాను సంబాళించుకోడానికి రెండు నిముషాలు పట్టింది.

"సరితా! నువ్వు డబ్బుకాశపడే కరుణాని చేసుకున్నావంటే నేను నమ్మలేకపోతున్నాను. నిజం చెప్పు. నన్ను కాదని అతన్ని ఎందుకు చేసుకున్నావు?"

"నన్ను చెప్పమంటావా శరత్!" వెనుక నుంచి గంభీరమైన కంఠస్వరం వినిపించి దిగ్గున మెడతిప్పి చూశాడు శరత్.

సరిత తలెత్తి చూసి కొయ్యబారిపోయింది.

కరుణాకర్ యిద్దరి మధ్యలోకి వొచ్చి నిల్చున్నాడు.

కత్తివాటుకు నెత్తురుచుక్క లేనట్లు సరితా, శరత్‌ల ముఖాలు పాలిపోయాయి.

"సరిత పట్టి పిచురాలు. ఆ సంగతి నీకు తెలుసు. కళ్ళారా చూశావు. విన్నావు. అటువంటి పిల్లను పెళ్ళిచేసుకోవాలని ఎలా అనుకున్నావు?"

శరత్ తల దించుకున్నాడు.

"శరత్‌ని కాదని నాతో పెళ్ళికి ఎందుకొప్పుకున్నావు!"

సరితవైపు తిరిగి కఠినంగా అడిగాడు.

బిక్కచచ్చిపోయింది సరిత.

"ఊఁ నాకు సమాధానం కావాలి" గద్దించి అడిగేసరికి సరిత శరీరంలో సన్నగా వొణుకు ప్రారంభమయింది.

"హాస్పిటల్‌లో వున్న మీ అక్కని చూడ్డానికొచ్చిన రోజు గుర్తుందా? ఆ రోజు....నర్స్, సావిత్రి పిలుస్తున్నదని నిన్ను గదిలోకి తీసుకెళ్ళింది. ఏంచెప్పింది మీ అక్క?"

"మాట్లాడవేం?" గద్దించి అడిగాడు.

"తన పిల్లలకి....నేను తల్లిని కావాలని-" కంపితస్వరంతో బదులిచ్చింది.

"ఐతే శరత్ చెప్పిందే నిజం. నా ఐశ్వర్యాన్ని,హోదానిచూసి ఆశపడ్డావు. అడిగిందే చాలునని వెంటనే వొప్పేసుకున్నావు. ఔనా?"

"లేదు."

"మరి?"

"ఆ స్థితిలో అక్క తన కోరిక తీర్చమని అడిగితే కాదనలేక పోయాను. అక్క కోరిక ఏదైనా సరే తీరుస్తానని మాటిచ్చాను. ఆ తరువాతే అక్క యీ సంగతి చెప్పింది."

"నీతో పెళ్ళికి వొప్పుకోకపోయుంటే!"

"మీరు అలా అంటారనే అనుకున్నాను. కానీ...."

"పెళ్ళికి వొప్పుకున్నాను. ఎందుకు? ఎందుకో తెలుసా? సావిత్రి నా చేత వాగ్దానం చేయించుకుంది. తన బిడ్డలకు నిన్ను తల్లిని చేయమని." ఈ మాట లని కరుణాకర్ కొద్దిసేపు మౌనంగా వుండిపోయాడు.

"కరుణా! నన్ను క్షమించు. నేను పొరపాటు చేసాను." కరుణాకర్ రెండుచేతులూ పట్టుకున్నాడు శరత్.

"మామూలు పొరపాటు కాదు శరత్! పెద్ద పొరపాటే చేసావు. నీ మాటలు నమ్మి సరితను అవమానించాను. నీ వ్రాతలకి సావిత్రి కోరిన కోరికని అన్వయించుకున్నాను. దేవతలాంటి నా భార్యని అనుమానించి ఎంత క్షోభ అనుభవించానో!" తనలో తను అనుకుంటున్నట్లుగా అన్నాడు.

"అవన్నీ మర్చిపొమ్మని చెప్పలేకపోతున్నాను" బాధగా అన్నాడు శరత్.

"లేదు శరత్. అన్నీ మర్చిపోవడానికే ప్రయత్నిస్తున్నాను. నా భార్యమీద ప్రేమకొద్దీ, ఆమె కోరిక నెరవేర్చాలనే ఉద్దేశంతో సరితకి అన్యాయం చేసాను. శరత్! నేనో మాట చెపుతాను నమ్ముతావా?"

"కరుణా!"

"కాదు శరత్! పరిస్థితులనుబట్టి—చూడు రవిచంద్ర, పాపతోపాటు సరితకూడా నా బిడ్డతో సమానం అంటే నమ్మగలవా?"

శరత్‌తోపాటు, సరిత కూడా షాక్ తిన్నట్లు విభ్రాంతు రాలయింది.

"సావిత్రి చివరికోరిక తీర్చాలనే సరితని, పిల్లలకి తల్లిని చేసాను. అంతే. అంతకంటే మామధ్య ఎటువంటి సంబంధమూలేదు."

ఆశ్చర్యం నుండి తేరుకోలేకపోతున్నాడు శరత్.

"సావిత్రి సాక్షిగా, నా అంతరాత్మ సాక్షిగా యీ మాటలు చెప్తున్నాను. అంతకంటే వేరే సాక్షులు ఎవరూ లేరు."

"ఉన్నాను బాబూ!"

ఒకేసారి తలలు తిప్పిచూశారు కరుణాకర్, శరత్.

రంగన్న అక్కడికొచ్చాడు.

"అయ్యగారు చెప్పిన మాట యదార్ధమే బాబూ! పార్వతీ పరమేశ్వరుల్లా వుండే దంపతులను చూసి వోర్వలేక, ఆ భగవంతుడు అన్యాయం చేసాడు. అమ్మగారు పోయి ఆర్నెల్లు తిరక్కుండానే అయ్యగారు మళ్ళీపెళ్ళి చేసుకున్నారు. నాకెందుకో అనుమానం కలిగింది. ఆ రాత్రి పదినిముషాలకో మెట్లు ఎక్కుతూ అమ్మాయిగారు మేడపైకి వెళ్ళారు. వెంటనే అయ్యగారు గొంతు కంచుగంటలా వినిపించింది. 'ఈ పెళ్ళితో నువ్వు పిల్లలకి తల్లివయ్యావుగానీ, నాకు భార్యవిమాత్రం ఏనాటికీ కాలేవు.' ఆ మాటలు ఇప్పటికీ నా చెవుల్లో గింగురుమంటూనేవున్నాయి బాబూ! అమ్మాయిగారు పరుగుపరుగున మేడదిగి వచ్చేసారు. నాకెందుకో సంతోషమనిపించింది. అయ్యగారి మీద గౌరవం మరింత పెరిగింది. అయ్యగారిని ప్రతీక్షణం నేను గమనిస్తూనేవచ్చాను. ఆయన నిజంగా దేవుడు బాబూ! దేవుడు. ఆయన చెప్పిందాంట్లో ఆవగింజంతైనా అసత్యంలేదు" శ్రోతలు తెల్లబోయారు. కాస్సేపు అక్కడి వాతావరణం స్తబ్దుగా మారి పోయింది.

"బాబూ! నేనీ యింటినౌకర్ని. యిటువంటి విషయాల్లో జోక్యం చేసుకోడం నాది తప్పే. సాక్షు లెవరూ లేరని మీరు బాధ పడుతుంటే వోర్చుకోలేకపోయాను. మన్నించండి."

కరుణాకర్ కాళ్ళమీద పడబోయాడు.

"కాళ్ళమీద పడేటంత తప్పు ఏం చేసావనీ? లే రంగన్నా!" శాంత గంభీరస్వరాలతో అంటూ అతని బుజాలు పట్టుకుని మధ్యలోనే ఆపేశాడు.

"మీరు నిజంగా దేవుడు బాబూ! దేవుడు" తడికళ్ళతో రెండు చేతులూ జోడించి నమస్కరించి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు రంగన్న.

కొన్ని క్షణాలు మౌనం చోటుచేసుకుంది.

కరుణాకర్, శరత్ దగ్గరగా నడిచివచ్చి అతని భుజంమీద చేయివేశాడు.

"ఏమిటీ అవతారం? రాత్రంతా ప్రయాణంచేసి అలిసిపోయి నట్లున్నావు. వెళ్ళి విశ్రాంతి తీసుకో. నాకు చెప్పకుండా మాత్రం పారిపోకు" స్నేహపూర్వకంగా అని, అక్కడి నుంచి మెట్లెక్కి మేడమీద తన గదిలోకి వెళ్ళిపోయాడు.

అప్పటివరకూ శ్వాససైతం బిగబట్టి శిలలా నిలబడ్డ సరితలో చలనం వచ్చింది. లోపలికి వెళ్ళిపోయింది.

శరత్ అక్కడేవున్న సోఫాలో వెనక్కివాలి కూర్చుని కళ్ళు మూసుకున్నాడు.

* * *

రాత్రి పన్నెండు గంటలయింది.

కరుణాకర్ తన గదిలో టేబులు ముందు కూర్చుని శరత్‌కి వుత్తరం వ్రాసాడు.

ప్రియమైన శరత్!

రెండు రోజులనుండీ నీతో మాట్లాడాలని నా ప్రయత్నం. క్షణం తీరిక దొరకలేదు. ఇండోపాక్ వార్ ప్రారంభమయిందన్న సంగతి నీకు తెలిసేవుండొచ్చు.

దేశానికి మా అవసరం వచ్చింది. ప్రాణాల్ని సైతం లెక్క చేయకుండా పోరాడి దేశగౌరవం, దేశభద్రత నిలిపే బాధ్యత మా బుజస్కంధాలపై వుంది. పూనా రెజిమెంట్ బార్డర్‌కి తరలి రావల సిందని ఉత్తర్వు జారీ అయింది. ఈలోగా యీ ఘోరం సంభ

వించింది. ఈ అత్యవసర పరిస్థితులలో ప్రమోషన్ మీద నన్నక్కడికి ట్రాన్స్‌ఫర్ చేశారు. రేపే నా ప్రయాణం. తిరిగి రాకను గూర్చి చెప్పలేను. శరత్! నిన్నో స్నేహితుడిగా ఎప్పుడూ అనుకోలేదు. అందుకే నీ మీద కొంత బాధ్యతపెట్టి వెడుతున్నాను. నా ఆస్తికీ, నా పిల్లలకీ నువ్వు గార్డియన్‌వి. ఆస్తిమొత్తం నాలుగు భాగాలుగా విభజించాను. రవిచంద్ర, పాప, సరిత ముగ్గురూ నాకు సమానులే. మూడు వాటాలు వారికి. నాలుగోది దేశరక్షణ నిధికి యిచ్చేసాను. సరితకి తండ్రిలేడు. తల్లి వుండీ లేనట్లే. సరిత కూడా పిల్లలతోపాటు నీ సంరక్షణలోనే వుంటుంది.

ప్రేమ, పెళ్ళి వీటితోనే జీవితమంతా నిండలేదు శరత్: జీవితంలో యివి ముఖ్యాంశాలు మాత్రమే. ఇది నేను తెలుసుకున్న జీవిత సత్యం.

మానవజన్మ మనకో వరం. ఈ జన్మకు సార్థకత కల్పించడం కల్పించకపోవడం మనచేతుల్లోనే వుంది.

జీవితంలో ఎన్నో ఆటుపోటులు వస్తూపోతూ వుంటాయి. వాటిని తట్టుకోగలిగే స్థైర్యం, మనోనిబ్బరం అలవర్చుకోవాలి. స్వల్పవిషయానికి వ్యాకులపడుతూ ఐనవాళ్ళ మనసులు కష్టపెట్టడం మంచిదికాదు. నీ గురించిన మనోవ్యాధితో కుమిలిపోతోంది అమ్మ. కన్నతల్లి కంట తడిపెట్టించకు శరత్! అన్నయ్య మాట వింటావుగా:

ఇంకో విషయం.

కొందరు సంఘానికి భయపడి కొన్నికొన్ని పనులు చేయడం మానుకుంటారు. దానికి కారణం వాళ్ళల్లోని పిరికితనం, 'మంచి' అనిపించుకోవాలనే కాంక్ష అనుకుంటా. కానీ, నా ఉద్దేశం, మనకి మంచిదని తోచినపని చేయడంలో తప్పేంలేదు అని. మనద్వారా ఒకరికి అపకారం కాకుండా, వుపకారమే జరుగుతున్నది అను కున్నప్పుడు ఆ పని చేయడానికి ఎవరికో ఎందుకు భయపడాలి? నీది తప్పుకాదని నీ అంతరాత్మ సాక్ష్యమిస్తే చాలదూ?

నువ్వు, సరిత పరస్పరం ప్రేమించుకున్నారు. పెళ్ళిచేసుకో వాలనుకున్నారు. కానీ విధి వక్రించి మధ్య కొన్ని అవాంతరాలు

యేర్పడ్డాయి. అక్కకిచ్చిన మాట నిలబెట్టుకోడానికి ప్రేమని సైతం త్యాగం చేసిన సాధ్వి—సరిత.

అటు ప్రేమించిన వ్యక్తికీ, యిటు పెళ్ళాడిన వ్యక్తికీ ఎవరికీ ఏమీ కాకుండా ఏకాకిగా మిగిలిపోయింది సరిత. నువ్వు సరితని ఎందుకు పెళ్ళి చేసుకోకూడదూ! ఆమెని చేసుకోవడం తప్పెలా అవుతుంది? స్నేహితుని, భార్యని వంచించి మోసం చేయడంలేదుగా. అటువంటప్పుడు నలుగురూ అనుకుంటారని భయమా? అనుకోనీయ్. ఎన్నాళ్ళనుకుంటారు?....నాలుగురోజులు. అసలీ అనుకునేవాళ్ళు తప్పు చేయరనా! అంతా వట్టిది. పదవి, డబ్బు అనే బురఖాలు కప్పుకుని వాళ్ళుచేయని నైచ్యం అంటూ వుండదు. సంస్కరణ గురించి వుపన్యాసం యిచ్చేవాడు సంస్కర్తకాడు. అయితే ఒక్క విషయం. ఇటువంటి పని చేయడానికి మనోధైర్యం కావాలి. జీవితంలో ఏదో వోరోజు 'నేను తప్పుచేసాను' అని తిరిగి నువ్వు పశ్చాత్తాప పడకూడదు. ఆ ధైర్యం, మనోనిబ్బరం నీకుంటే సరితని పెళ్ళి చేసుకోడమే మంచిదని నా అభిప్రాయం. తుదినిర్ణయం నీదే.

ఆశీస్సులతో
కరుణాకర్.

శ్రీ అరుణాదేవిగారికి నమస్కరించి వ్రాయునది!

అమ్మా! మీ ఉత్తరానికి చాలా ఆలస్యంగా జవాబిస్తున్నందుకు మన్నించండి.

శరత్ విషయంలో మీరిక కన్నీరు కార్చవలసిన అవసరం వుండదని హామీ యిస్తున్నాను. శరత్ మళ్ళీ మునుపటి శరత్‌గానే మీ ముందుకొస్తాడు. మీరు వ్రాసిన ఆ అమ్మాయి—సరిత నా భార్య చెల్లెలు. మిగత వివరాలన్నీ మీరు శరత్‌ద్వారా వినగలరు. దేశరక్షణ కోసం వెడుతున్న నాకు మీ ఆశీస్సులు కావాలి.

ఇట్లు
మీ పుత్రసమానుడు కరుణాకర్.

ఎడ్రస్ వ్రాసి రెండు కవర్లూ పేపర్‌వెయిట్ క్రింద పెట్టాడు.

టేబులు క్రిందకు కాళ్ళు చాపుకుని, కుర్చీవెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు.

*　　　　*　　　　*

మెడ్రాస్ సెంట్రల్ స్టేషన్!

టవర్ క్లాక్ సాయంత్రం అయిదుగంటలు చూపిస్తోంది.

నాలుగోనంబర్ ప్లాట్‌ఫారమ్ మీద మద్రాస్ నుండి పూనా వెళ్ళు ఎక్స్‌ప్రెస్ ట్రయిన్ ఆగివుంది. పేసింజర్లందరూ హడావిడిగా ఎక్కుతున్నారు. వీడ్కోలిచ్చేవారు యిస్తున్నారు. అంతటా కోలాహలంగా, రణగొణ ధ్వనిగా వుంది.

కరుణాకర్ ఆ ట్రయిన్‌లోనే పూనా వెళ్తున్నాడు.

ఫస్టుక్లాసు కంపార్టుమెంట్ దగ్గర అతని చుట్టూ పెద్దగుంపు- అతని స్నేహితులు, ఆత్మీయులు.

ఒకొక్కరి దగ్గరే వీడ్కోలు తీసుకుంటున్నాడు కరుణాకర్. స్నేహపాత్రుని, ఒక మంచి మనిషిని దూరం చేసుకుంటున్నాము అన్న భావనతో అందరి హృదయాలూ బరువెక్కాయి. వాళ్ళ హృదయావేదనంతా, వాళ్ళ ముఖాల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

కరుణాకర్ గంభీర వదనంతో ఒకొక్కరినే దాటుకుంటూ వస్తున్నాడు. వర్మదంపతుల ముందుకొచ్చి ఆగిపోయాడు.

అందరి దగ్గరా సెలవు తీసుకున్నట్లు, వర్మగారికి కూడా షేక్‌హేండ్ యిచ్చి, వీడ్కోలు తీసుకోడానికి అతని చేయి ముందుకు రాలేదు. క్షణం ఆయన కళ్ళల్లోకి చూచి చప్పునవంగి ఆయన కాళ్ళకు నమస్కరించబోయాడు. మెరుపులా అతన్ని పైకిలేపి హృదయానికి హత్తుకున్నాడు వర్మ. ఆయన చిన్నకళ్ళు సెలయేరులయ్యాయి. కన్నీరు ఆపుకోడానికి ఆయన ప్రయత్నం చేయలేదు. చూస్తున్నవారి మనసులు ఆర్ద్రమయ్యాయి.

మిసెస్‌వర్మ "బాబూ కరుణ్! మాకు దూరంగా వెళ్ళిపోతున్నావా నాయనా!" అంటూ కరుణాకర్ యెదమీద వాలిపోయి చాలాసేపు యేడుస్తూ వుండిపోయింది.

ఆమెను ఓదార్చి, తన చేతిరుమాలుతో ఆమెకళ్ళు తుడిచాడు.

కాస్త ఎడంగా శరత్ నిలబడివున్నాడు. అతనిముఖం తెల్లగా పాలిపోయివుంది. గుడ్లప్పగించి చూస్తున్నాడు.

అతని చేయి పట్టుకుని నిల్చున్న రవిచంద్రకి అంతా అగమ్యంగా వుంది.

కరుణాకర్, కుర్రవాడిని చేతుల్లోకి తీసుకున్నాడు.

"డాడీ! నువ్వు రైల్లో వెళ్ళిపోతున్నావా?"

తండ్రి ముఖంలోకి చూస్తూ అడిగాడు రవిచంద్ర.

"ఔను బాబూ!"

"మళ్ళీ ఎప్పుడొస్తావు?"

"నువ్వు పెద్దవాడివయ్యాక."

"ఎంత పెద్దగా!....బాబాయ్ అంత అయ్యాకా?"

"ఔను."

"నువ్వు వచ్చేటప్పుడు అమ్మని తీసుకొస్తావా?"

"ఆఁ అమ్మా, నేను కలిసే వస్తాం. నీ దగ్గరే వుంటాం."

రవిచంద్రని చెంపమీద ముద్దుపెట్టుకుని దింపాడు.

"పూనా వెళ్ళే ఎక్స్‌ప్రెస్ ట్రయిన్ నాలుగోనంబర్ ప్లాట్‌ఫామ్ మీదినుండి కొద్ది నిముషాలలో బయల్దేరనున్నది" మైక్‌లో ఎనౌన్సుమెంటు వినిపిస్తోంది.

శరత్, తనముందు నిల్చున్న కరుణాకర్ కళ్ళల్లోకి సూటిగా చూస్తున్నాడు. అతని కళ్లు ఎర్రగా, తడిగా వున్నాయి. అతను ఏదో కరుణాకర్‌ని అడగాలనుకుంటున్నాడు. కానీ, దుఃఖభారంతో పూడుకు పోయిన అతని గొంతు పెగిలి రావడంలేదు.

"శరత్!—"తన రెండు చేతులతో బంధించాడు కరుణాకర్.

"కరుణా! ఇది....అన్యాయం....అన్యాయం...." శరత్ దుఃఖం కట్టలు తెంచుకుంది.

శరత్‌ని, తనకెదురుగా నిలబెట్టుకుని కళ్లు తుడిచాడు.

"ముందుగా చెప్పడానికి వ్యవధి లేకపోయింది. ఇదుగో ఇందులో నీకంతా వ్రాసాను" జేబులోంచి కవరు తీసి శరత్‌చేతిలో పెట్టాడు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M107 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 115 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Rukshana |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |